ఓం.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

ఆబాలవృద్ధుల కుపయోగంబగునట్టుల
సులభశైలిలో కూర్చబడినది.

శ్రీ

# నారాయణసుభాషితము

అను

వేదాంతవిషయములను తెలిపెడు
సూక్ష్మబోధ.

---

తోటకూరు వెంకటనారాయణ
విరచితము.

---

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు,
డి. కే. పంత్ చే ముద్రింపబడియె.

---

 1921. [వెల 0—6—0.

# అవతారిక

ఈ చిన్నిపొత్తమును రచియించిన గ్రంథకర్త హిందూస్థానములో చేరిన గంజాంజిల్లా, శ్రీకాకుళం కాపురస్థుడు. ఇతని జన్మభూమి బ్రహ్మపురము. తల్లి సుబ్బమ్మ, తండ్రి గురయ్య, కాపుకులోద్భవుడు. పైడిపాల గోత్రోద్భవుడు. ఇతడు మహాణాఖ్యానము కొంతవరకు వైశాఖపురిలోవున్న హిందూ కాలేజిలో చదసినాడు. ఆంధ్రభాషయందలి అంతగా నిపుణత గలిగినటుల తోచదు. ఇతనియొక్క సుశీలతను స్వాభావికగుణమును యీపొత్తమే వెల్లడిపరచుచున్నది.

1916 సంవత్సరములో వచ్చిన ప్లేగుజాడ్యములో లాలాగుడా (శికింద్రాబాదు సమీపమున) క్యాంపులోవున్న వ్యాసు మహారాష్ట్రభాషలో విరచించిన శ్రీభగవద్గీతను మా॥ వి. టి. కులశేఖరం మొదల్యారుగారు, అచ్చట కొంతమంది సత్పురుషులకందరకు సాంతముగా చదివి వినిపించుట తటస్థించెను. వీరుచాలా ఓర్పుగలిగి దయాహృదయులై అంతశ్రమదీసుకొని ఆవిషయమును తెనిగించి చెప్పినందులకుగాను యీగ్రంథకర్త యీమహోపకారమును మరవకుండా వుండునటుల యీచిన్నిపొత్తమును రచియించుటకు కారణంబయ్యెనని తోచుచున్నది.

ఇతనికి అలవడినంత ఆంధ్రభాషయందలి పదములకుం గల మైత్రిని సమకూర్చి విన్నదానిని, స్వానుభవమునకువచ్చి నదానిని, శాస్త్రపురాణేతిహాసములలో కొన్ని సారాంశముల ను క్లుప్తముగా నొకచోటనే గుదిగూర్చి యీచిన్నిపొత్తము ను రచించినాడు. ఇతనికి వ్యాకరణశాస్త్రానుభవము చాలా స్వల్పము. "చెఱకునకు వంకబోనేమి, చెడునేతీపు" అన్నరీతిగా వ్యాకరణశాస్త్రాది గ్రంథములయొక్క పరిచయము స్వల్పమై నప్పటికిన్ని విషయమును తీపునుమాత్రము చక్కగా వదిలవర చినాడు.

స్వతఃసిద్ధమైనటువంటి సత్యమును ప్రతివిషయమందున ప్రతిపాదించుటలో చాలా శ్రమయెత్తుకొని అతనికి జ్ఞాపకము న్నంతవరకు కొన్ని గ్రంథములలో ముఖ్యాంశములను కొన్ని టిని మాత్రముచేర్చి అనుభవమునకు యెంచిచూచిన యెడల వ్యత్యాసము గాన్పించనటుల యీచిన్నిపొత్తమందలి విషయ మును అంత మృదుశైలిలో వ్రాసినాడు.

శికంద్రాబాదు,
6—4—21.

బళ్లారి భీమసేనరావు
యస్. ఐ. యస్.



# నారాయణ సుభాషితము.

---

అవ్యక్తావస్థలోనున్న బాలురు సముద్రతీరమున క్రీడా వినోదార్థమై విహరించునపుడు అందందున వారలదృష్టికి గోచరమగు వివిధమైన చిత్రవిచిత్రములగు నత్తగుల్లలను, గులకరాళ్లను, గవ్వలను, కాంతపురాళ్లను, స్ఫటికపురాళ్లను, మొదలుగాగల వినోదమైన వస్తువుల విలువను పాటించక, దృష్టికి మాత్రము అతిరమ్యముగాను, చిత్రముగాను ప్రదర్శించు వాటినన్నిటిని వక్కచోటనే మూటల ఆనందముతో గుమిగూర్చు దరో అటువలెనే సంస్కృతాంధ్ర భాషలందలి పదములకుంగల పరస్పరమైత్రి నించుకైనను పాటించక విషయమునెడు దృష్టికి రమ్యముగా గనబడు పదములను మాత్రము, యెద్వి ధలో పదములున్నను, వక్కచోటనేగూర్చి విషయము చక్కగా ప్రకాశించునటుల నాశక్తి వంచనలేకుండా యీచిన్నిపొత్తమును వ్రాయబూనితిని.

ఆకాశ కుసుమములను వాసనచూడవలెననియు, రంకులాడి అరుంధతిపదవికి రావలెననియు, విందుగురు పురుగు సూర్యుని గెలువవలెననియు, భోగవనిత పతివ్రతలకు సాటిగా

వలెననియు ప్రయత్నము చేసినయెడల యెంత ప్రయోజనకారి యగునో, అల్లిబిల్లిగానల్లిన యీచిన్ని పొత్తమును వ్రాసి, సంస్కృతాంధ్ర భాషలందలి ప్రౌఢతను వహించి, వేదాంత రహస్యములను చక్కగా అనుభవజ్ఞానముచే గ్రహించినటువంటి మహాపండితులచేత వ్రాయబడిన విషయముల కంటెను యిది చక్కగా ప్రకాశించునని తలంచుట అంత ప్రయోజనకారి యే నగును.

మరియు మాజననియగు సుబ్బమ్మగారు నోచిన నోములయొక్క ప్రభావమని యే నెంచనగును. మాజనకుడగు గురయ్యగారు చేసినసుకృతవిశేషముతప్ప నితరమేమియుండవచ్చును. పుత్రవాత్సల్యతజూపినన్ను పసితనమునుంచి మంచిమార్గమునందున ప్రవేశించునటుల జేయు సుబోధనలనొసంగిన మాగురువుగారియొక్క అఖండమైనదయయే యీరూపముగా నాజిహ్వా యందునటించినది.

పరతత్వ చింతానుభవులైనటువంటిన్ని సంతత శాంతస్వభావము గలవారైనటువంటిన్ని బ్రహ్మశ్రీ సిరిగుప్ప మధ్వేశ రావు పంతులుగారి కనిష్ఠ పుత్రరత్నంబగు బ్రహ్మశ్రీ బల్లారి భీమసేనరావు పంతులుగారు యీ చిన్ని పొత్తమును చక్కగాపరిశీలించి విషయమందలిగల కొన్ని దోషములను అచ్చటచ్చట తొలగించి శక్తివంచన లేకుండ సాధ్యమైనంతవరకు విషయమును దోషరహితముగాను చదు

వరులకు శ్రవణానందమగునట్టులగాను జేసినందులకు వారి యొక్క సుగుణసంపత్తిని యెంత కొనియాడినను తీరదుగాన కృతజ్ఞతాసూచకముగా వారికి నావందనములు:—

మరియు యీచిన్నిగ్రంథమును ముద్రించుటకొరకు నన్ను ప్రోత్సాహకరచి సాధ్యమైనటువంటి సహాయమునుగాని సలహానుగాని సమయస్ఫూర్తిగా నాకునొసంగి యీగ్రంథ ముద్రితమనెడు కార్యమును తుదముట్టించి నందులకుగాను మ॥ సిద్ధోజు రామస్వామి యెల్లయ్య గార్లయొక్క వుదార సాహసముల నెంతనికొనియాడుదు.

వీరలకుతోడుగ యీకార్యమును నిర్వహించుటయందలి ప్రోత్సాహమును జూపినటువంటి మ॥ జక్కంపూడి ఆది నారాయణ నాయుడుగారియొక్క మ॥ పి॥ నరసింహులు గారి యొక్కయు కీర్తులను శ్రీరామచంద్ర పరమాత్మ ఆచంద్రతారకముగ ప్రకాశింపజేయుగాక:—

ఇట్లు

తో. వెంకటనారాయణ,

బుధజనవిధేయుడు.

---

# అంకితము.



ప్రవాహములో యెంతకల్మషమున్నను సాగరమంగీకరించునటుల నా చిన్ని పొత్తములో యెన్నిబొల్లులున్నను వసుంధరాత్మజాలోలుడైన శ్రీరామపరమాత్మ అంగీకరించునని దృఢచిత్తత గలవాడనైతిని.

రాజహంస నీరమును క్షీరమును గలపివకచోట నుంచినయెడల క్షీరమును గ్రహించి నీరమును నిగ్రహించునటుల పండితులు పామరులు యీచిన్ని పొత్తమందలి యెవ్విధమైన దోషములున్నను మన్నించి విషయమును మాత్రము గ్రహింతురని నాముఖ్యప్రార్థన.

ఇట్లు,

గ్రంథకర్త.

# TESTIMONIAL.

Camp : SRINAGAR.
2—12—1918.
V. KAMESWARAROW,
B. A. B. L. & F. T. S.

*Dear Sir,*

I have been all the while on tour and now returned from the camp. I remember to have promised you to give my "opinion regarding the book written by you styled Narayana Subhashitam."

I herein enclose my opinion which I hope, you will find.

Closing with my best wishes to you in your future endeavours.

Yours truly,
*V. Kameswararao.*

# OPINION.

I have gone through your book and found to be the most useful one to men of all ages. The simple and beautiful figurative language expressed therein is really displaying the wit of the author. The compilation of this book shows the pains taken by the author in establishing the fundamental truth of nature.

Men of good experience in philosophy, I believe, do agree with the author in many points.



ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ

# నారాయణ సుభాషితము

శ్లో॥ ఓంకారంబిందుసంయుక్తం నిత్యంధ్యాయంతియోగినాం
కామదంమోక్షదంచైవ ఓంకారాయనమోనమః॥
గమాగమస్థంగమనాదిశూన్యాంచిద్రూపదీపంతిమిరాపహారం।
యత్పాంచతేసర్వజనాత్మసంస్థంనమామ్యహంసంపరమాత్మరూపం।
బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చసదాశివః।
ఏతేగర్భగతంచైవ తస్మైశ్రీగురవేనమః॥

---

ఈప్రపంచమందున యీశ్వరునిచేసృజింపబడిన అనంత కోటిజీవరాసులలో మానవుడైజన్మించుట శ్రేష్ఠము. దానిలో యీభరతఖండమున జంబూద్వీపమందుపుట్టుట వుత్తమము.

ఏలననగా సమస్తప్రాణులకు వారివారియొక్క కోర్కెలను సఫలతజెందించుటకు తగినటువంటి పదార్థములకు ఆటపట్టై యున్నది. మరియు భక్తి, జ్ఞాన, తత్వ, వైరాగ్య, ముక్తులనెడు వాటియొక్క సారమును గ్రోలినటువంటి మహాత్ములకు జన్మభూమియై యున్నది. మానవుడైపుట్టుట దుర్లభము. దానిలో అంగహీనుడుగాకుండావుండుట ఉత్తమము. దానిలో పురుషుడై జన్మించుట దుర్లభము. దానిలో బ్రాహ్మణుడై పుట్టుట ధన్యత. ఇచ్చట బ్రాహ్మణుడనగా బ్రహ్మజ్ఞానమునుసంపాదించినవాడని అర్థము. ఏలనగా శ్లో॥ జన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతేద్విజః। వేదాభ్యాసేనవిప్రాణాం। బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥

మరియు అద్వితీయపరబ్రహ్మమగు భగవంతుడు ఓంకారస్వరూపుడని చెప్పబడుచు. ఆఓంకారము అకార ఉకార మకార సంజ్ఞారూపకమయిన అక్షరత్రయములతో సంకలితమయివుండును. వీనినే పెద్దలు ప్రణవమని చెప్పుదురు. ప్రణవార్థమును గ్రహింప పరిశుద్ధబ్రహ్మవేత్తలకు తప్ప యితరులకు సాధ్యముగాదు. ప్రణవమే పరబ్రహ్మమని వేదములు ఘోషించుచున్నవి. యిటువంటి ప్రణవార్థము నెరిగినవాడే బ్రహ్మజ్ఞాని అనిన్ని యిటువంటిజ్ఞానము గలుగుటే బ్రహ్మజ్ఞానము గలుగుట యని అర్థము.

యిచ్చట జాతివిచక్షణ లేదు. ఏలననగా పూర్వము మహాభక్తులు, పరమతపోధనులగువారలు యావన్మంది వార లభక్తి తపఃశక్తులచేతనే బ్రహ్మత్వమును పొందిరిగాని జాతి వలన బ్రహ్మత్వమును బడసినవారలు కారైరి. మనుజుడై జ న్మించినందుకు ఫలము యేమనగా తనకు సమస్తజీవరాసుల కంటె నుత్తమమైన జన్మము లభించినందుకు దానిని సార్థక ముజెందించుటయే మానుషత్వముగాని దీనికి వ్యతిరేకముగా నడచుకొనుట ద్విపాదజంతుసమానమని పిలువబడును. గనుక మనుజుడు అతిజాగరూకుడై తనకుగల్గిన మానవజన్మమున కవమానమువాటిల్లకుండా రాత్రింబగలు బూనికతో ప్రయ త్నించవలెను. యీరీతిగా బ్రయత్నించుటకుముం దేక్రియ ఆవశ్యకమో అది యేవిధముగా లభించునో దానిని గుర్తెరిగి పురుషుడు పూనికతో పాటుపడవలయును. మనుజుడు తన పూర్వకర్మచే జన్మమును నున్నతదశకు తెచ్చుకొనుటకు చతుర్విధపురుషార్థములు గలవు. అవి ధర్మము, అర్థము, కామ ము, మోక్షము వీటిలో మోక్షమనునది వక్కటిమాత్రమే మనుజుని జన్మమును సాఫల్యతజెందించును. మోక్షమనగా జీవుని బంధవిముక్తునిగా జేయుటయని అర్థము. యీమోక్షము బొందుటకొరకు తగినవుపకరణములు గలవు. వాటిలో 1 క ర్మయోగము, 2. భక్తియోగము, 3 జ్ఞానయోగము. యిచ్చ టయోగమనగా జీవపరమాత్మైక్యానుసంధానమని అర్థము.

యోగమనగా కూడిక అని అర్థముకూడా గలదు. పైనుదహా రించిన మాటివిషయమై కొద్దిగా సూచించి విడచెద.

భక్తియోగమనగా నవవిధభక్తులచే జీవాత్మను పర మాత్మతో సంధించుట అని అర్థము.

కర్మయోగమనగా యేవిధమైన కర్మచేసినప్పటికిన్నీ దానియొక్క ఫలాపేక్ష లేకుండా వుండుట. మరియు కర్మచే యునప్పుడు కర్మిష్టివలెనే గాన్పించవలెను, గాని దానిఫలము నుమాత్రము గోరగూడదు. కోరినయెడల దగినంత ఫలము లభించును గాని శాశ్వతానందముకలుగదు.

ఉదహారణము:—

వకమనుజుడు మరియొకమనుజునకు వకపనినిగాని యే దోవకవిధమైన జీవనోపాయమునుగాని చూపించి వానివల్ల యే విధమైన లాభమును బొందినయెడల ఆమనుజుడు వానికి ప్ర త్యుపకారముగా చేసిన లాభమును స్వీకరించుటలో యేయే పాపము లొనర్చినాడో అవి అన్నియు యీలాభమును ప్ర త్యుపకారముగా బడసినవానికి తప్పక జెంది, తుదకు కర్మ సంచయమును వృద్ధిపొందించును. గాన యీకర్మ చేయుక్షము లో వంచన యేమాత్రము వున్నయెడల తప్పక కర్మిష్టిగానే పిలువబడును. అనగా తన సుఖదుఃఖములు యేలాగువుండు నో పైవారలవికూడా అలాగునే వుండునని తలంచి వారల

కు జేయు కార్యములలో యేవిధమైన ప్రతిఫలము గోరకుండా జేయుటయే కర్మయోగ మనబడును. మరియు ఫలాపేక్షలేని కర్మమనగా గతించినదానికొరకు చింతించక దాబోవుదాని విషయమై గోరక సమదర్శియై సర్వకాలములందున తనకు లభించిన దానితో తృప్తిజెంది సర్వము పరబ్రహ్మస్వరూపమని దలంచి జేయుకర్మముల ఫలములను అపేక్షించక కర్మిష్టినలెనే జరిగించుకొనుచూ భగవంతునికి అర్పణజేయవలెను. లేశమాత్రమైన గోరికగాని, వంచనగాని మనస్సునందు గలిగి కర్మముచేసినయెడల తప్పక కర్మబాధించును గాన అతి జాగరూకతతో కర్మములను జేయుచు భగవంతునికి అర్పణజేయుచు జ్ఞానమును సంపాదించనలెను:—

జ్ఞానయోగమనగా జ్ఞానముతో జీవాత్మను పరమాత్మతో లయింపజేసి ఆనందించుట. యీజ్ఞానము మూడువిధములుగా పరిణమించును.

ఎటులననగా స్వాతివానచినుకు భూమిపైనబడినప్పుడు యింకిపోవును. ఆచినుకే తామరపత్రముమీద పడినప్పుడు ముత్యమువలె గాన్పించును. గాని దానిని మనము చేరిపిన యెడల చెడిపోవును. ఆచినుకే ముత్యపుచిప్పలో బడినయెడల ముత్యమగును. అటువలెనే శుద్ధజ్ఞానము గల్గినయెడల తప్పక జీవాత్మ పరమాత్మతో లయించి ఆనందమును బొందును.

ఇది యోగులననగా పైనుదహరించిన కర్మ, భక్తి, యోగములను చక్కగా ఆనుష్ఠించినయెడల జ్ఞానముదయించి సమస్తభూతములు పర్బ్రహ్మస్వరూపమని భావనగలుగును. అప్పుడే లోపలవున్న జీవాత్మ, పైగాన్పించు పరమాత్మయు యేకమని భావనగలిగి అవిద్యయను తెరను గురుభక్తి అనెడు జ్ఞానోదయము కాగానే అద్వితీయమగు పరబ్రహ్మము తానే యని తెలసి ఆనందించును.

పైనుదహరించిన మూటిలో నొకదానిని దేనినైనను మనము శ్రద్ధగల్గి బూనికొని ప్రయత్నించుటకు తలంచిన యెడల కొన్నిమార్గములు గలవు. వాటిని వివరించెదను:—సత్యము, భూతదయ, పరదారాధనవిసర్జనము, భక్తి, జ్ఞానవిచారణ. వీటిలో యేది అభ్యసించినప్పటికిన్ని త్రికరణశుద్ధి ముఖ్యకర్తవ్యము. త్రికరణశుద్ధి అనగా మనోవాక్కర్మములు మూడు యేకరీతిగా నుండవలెను.

## సత్యము

సత్యము పరిశీలించినయెడల దానికి సమతుల్యమైన పదార్థము ప్రపంచమందేదియు కాన్పించదు. ప్రాణములను కాపాడునంతటి శక్తి దానిలో గల్గియున్నది సత్యమువల్లనే సమస్తధర్మములు ప్రోవనడపనారంభించినవి. యిదియే మూలకారణము. యిదియే మోక్షద్వారమునకు మొదటిమెట్టు. దీని

వల్లనే సకలయిష్టార్థములు ప్రాణులకు జేకూరునని పెద్దలు వక్కాణింతురు. తుదకు చతుర్వేదములు సహితము యీ సత్యమునకు సమతుల్యముగావు. యిటువంటి మంచివస్తువును మనము యెంత అభ్యాసమునకు తీసుకొనివచ్చిన అంతఫలము లభించును. సత్యమును కాపాడుకొనుట మానమును కాపాడు కొనుటకంటె కష్టము.

పూర్వము షట్చక్రవర్తులలో నొకడగు హరిశ్చంద్రుడు మానవతియగు భార్యను సహితము ఛండాలునికి విక్రయించి తుదకు జాతి, మానము విడవాడి సత్యమును కాపాడుకొను టకు పడరాని గడగండ్లుపడి, పట్టువదలక తుదకు సత్యమును సాధించినందుచేతనే గదా త్రిలోకములందు కీర్తినిజెందెను. అదిగాక, యోగులకుగాని, తాపసులకుగాని తనదివ్యమంగళ విగ్రహాదర్శనమును నొసగనటువంటి అనుదర్శనమును నేత్రో త్సవముగా భగవంతుడు హరిశ్చంద్రునకు నొసగెను. గనుక అది కాపాడుకొనుటకు కొన్ని ప్రయత్నములను మనము సాధ్యమైనంతవరకు చేసినయెడల లాభకారియై యుండును.

మన దినచర్యలలో వుదయము మొదలుకొని సాయం తనమువరకు వివిధమైనటువంటి క్రియలు, వాటికనుగుణ్యము గా కర్మములు జరుగుచునే వుండును. అటువంటి కాలచక్రము యొక్క విలువసహితము సత్యమును అనుసరించియే నడచు చున్నది. అటువంటి కాలముయొక్క సృష్టి, స్థితి లయములకు

కారణభూతుడైనట్టి భగవంతున్నను సత్యస్వరూపుడని నామ
మునగలైను మరియు అటువంటి సత్యస్వరూపుని నియమించుట
కొరకు మంత్రములు ఏర్పడెను. అవి సనాతనమునుంచిన్ని
యుగత్రయములలో సహితము యీసత్యమనెడు దీపముచేత
నే ప్రకాశించుచున్నవి. మరియు చైతన్యమను పదార్థము ప్రతి
జడ అజడ వస్తువునందును గుమిడియుండియు కనిపించి, కని
పించనటుల వున్నదో అటువలెనే సత్యము అతిసూక్ష్మమై
సర్వమునందున నిండియున్నది.

యీసత్యమును అనుసరించి రాగద్వేషాదులు పార
దోలి అరిషడ్వర్గముల నంటగల్పి, యింద్రియమనోనిగ్రహము
ను గట్టిగా సాధించి దుర్లభమైనటువంటి బ్రహ్మజ్ఞానమును
సంపాదించుకొన్న మహాత్ములయొక్క దివ్యనామములను
త్రికాలములయందున కీర్తించుచున్నారము.

వకతార్కాణము చెప్పెద:—
పూర్వము రాక్షసులగురువగు శుక్రాచార్యుడు అసత్య
ముపలుకుమని బలిచక్రవర్తికి యెంతబోధించినను ఆ రాక్షసుల
రేడు వినక యీరీతిగా జెప్పెను :—

మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణీ
నిర్మూలనంబైన దు ।

ర్మరణాంబైన, గులాంతమైన నిజమున్
రానిమ్ము కానిమ్ము పో ।
హరుఁడైనన్ హరియైన నీరజభవుం
డభ్యాగతుండైన నాఁ ।
దిరుగన్నేరదు నాదుజిహ్వ వినుమా
ధైర్య వేయేటికిన్ ॥

అని గురువుగారికి సమాధానమును చెప్పెను. గాని తనకు కీడు మూడుననని గురువుగారు వారించినను వినక సత్యము కాపాడుకొనుటచేతనే శ్రీమహావిష్ణువు అతని ద్వారము వద్ద సదా సేవనొసంగుచుండెను. ఇది యిటులనుండగా యేహేతువచేతనోగాని, శుక్రాచార్యుఁడు బలిచక్రవర్తితో అసత్యము కొన్ని వేళలయందున చెప్పవచ్చును, దోషము చెందనేరదు, అని యీదిగువ నుదహరించిన రీతిగా జెప్పెను:—

గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ ।
ప్రాణ విత్తమానభంగమందుఁ ।
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు ।
బొంకవచ్చు నఘము పొందఁడధిప ॥

అనగా వివాహమునకు సంబంధించిన విషయములలో అసత్యము లాడవచ్చునని దోచుచున్నది.

కళ్యాణములు స్థిరపరచుటలో బాలికయొక్క లోపా లోపములు బాలునియొక్క తలిదండ్రులకు దెలియనీక ఆ బాలికను వారలముందు శ్లాఘించి యేదో వకవిధముచేత యత్నములు పన్ని వారిరువురకు కళ్యాణముగావించిన పిమ్మట బాలికాబాలకు లుభయులకు పరస్పర సంబంధము కలిగి నప్పుడు బాలికయొక్క లోపములు బాలుడు తప్పక గుర్తెరిగి బాలికయందుగల ప్రేమాతిశయములు దినదినము క్రమము గా తగ్గి తుదకు మానరక్షణ ప్రాణరక్షణకంటె ముఖ్యమని దోచి ప్రాణములను బలవంతముగా విడచిపెట్టుటకు ప్రయత్న పడినప్పుడు యీసంబంధమును యేపెద్దలు కూర్చినారో కదా యని పశ్చాత్తాపబడి వారిని దూషించి, విధినిదూరి, ప్రాణ ములు విడచుటయో లేక సన్యాసమును స్వీకరించుటయో తటస్థించును. నిక్కము ఆలోచించినయెడల అంతయు వివాహ కాలమందు యీదాంపత్యమునుకూర్చిన పెద్దలయొక్క గీర్తి యునియే శ్లాఘించపలసినది.—కాబట్టి సత్యము మొట్టమొదట నే వచించినచో యీకష్టము లు తలచూపకుండా వుండును కదా! ఇందుమూలముగా సత్యము యెంతవిలువగల పదార్థ మో ఆలోచించుడి.

మరియు ప్రాణ, విత్త, మానభంగమందు బొంకినచో దోషము ఘటించదని దెలసినయెడల చక్రవర్తియగు హరి శ్చంద్రుడు యేల అంత చిక్కులకు సహించి పడరాని పాట్లు

పడి సత్యమును కాపాడుకొన్నాను. పరబ్రహ్మస్వరూపుడగు
భగవంతునకు సత్యస్వరూపుడని నామముగలదుకదా? అస
గా పిపీలికాది బ్రహ్మపర్యంతము సత్యస్వరూపుడగు భగవం
తుడే సమవర్తియైయున్నప్పుడు సత్యమన్నమాటవుత్పత్త్యగుటకు
న్ను, వుత్పత్త్యయినచో దోషములేదని యెట్లు నిర్ధారణచేయన
గును. మాయాకల్పితులైన మానవులు నిస్సందేహముగా
మాయావిమోహితులై యింద్రియలోలురై సత్యాసత్యము
లయొక్క విలువను గ్రహించుటకు శక్తిలేక అసత్యము వకా
నొకవేళలందున బాధించదని వక్కాణించినట్లు గాన్పించు
చున్నది. గాని నిప్పు యెన్నటికైనను దాని వేడిమిని లేకుం
డా రాజిల్లదుగదా? మరియు నివురుచే గప్పబడినప్పటికిన్ని
నివురు తొలగించినయెడల నిప్పు యేలాగున నిజరూపమును,
గుణమును కనపరచునో అటువలెనే పాంచభౌతికకల్పితులైన
ప్రాణులు మాయను తొలగించుకొనినయెడల సత్యముయొ
క్క ప్రభావము కనబడును. తుదకు సత్యములేనిది జపము
లు, తపములు, యాగములు, హోమములు, క్రతువులు,
యోగములు, అణిమాదిసిద్ధులు మొదలగాగలవి యేవియు
ఫలింపనేరవు. వేయిమాటలేల ప్రణవముయొక్క ముఖ్యా
శ్రయముచేతనే వేదశాస్త్రములు నుపజీవించుచున్నవో ఆ
ప్రణవము సత్యరూపియై యున్నది.

మనము ప్రస్తుతము కుటుంబసంరక్షణార్థమై దినచర్య
లలో నుదయమైనది మొదలుకొని సాయంత్రమువరకు లెక్క
లేని అసత్యములను నాడుకొందుము. వాటివల్ల ఫలము లేన
ప్పటికిన్ని మన జిహ్వ అసత్యమాడుటయందు ఖ్యాతిని జెం
దును. దీని కొక తార్కాణము చెప్పెద:—తనచేత గానటు
వంటి కార్యమును చేయగలనని యితరులతో జెప్పి రిక్తకోరిక
లకు ఆస్పదమును గల్పించి కొంతకాలము నేడు రేపు అని
జరిపినందున వారిరువురయొక్క మైత్రి క్రమముగా క్షీణిం
చును. ఇంకా చీటికి మాటికి లీలావినోదముగాను క్రీడావి
నోదముగాను బొంకుట కలదు. ఇది యానత్తు సాధ్యమైనంత
మట్టుకు జిహ్వను పదిలపరచి దినదినము అసత్యములాడుట
తగ్గించినచో మంచిది. ఏలననగా గృహమునకు బునాది ఆ
ధారముగానున్నట్టు సకలమంత్రములకు నాధారముగానున్న
ప్రణవము సత్యస్వరూపియై యున్నది. ఇటువంటి ప్రణవము అ
క్షరములలో నొకటి. అక్షరమనగా నశించకుండా నుండునది
అని అర్థము. సత్యముతప్ప యితరమైనది యేదియైనను నశిం
చును గాన ప్రణవము సత్యరూపియైయున్నది ఇది యిట్టుల
నుండగా సుమతి యిట్లు వ్రాసెను:—

ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి అన్యు
లమనముల్ నొప్పించక తానొవ్వక । తప్పించుక తిరుగువాడు ।
ధన్యుడు సుమతీ॥ దీనియొక్క భావార్థము:-ఒక సంగతియొక్క

నిజస్థితి వకనికి బాగా తెలిసినప్పుడు అది యదార్థముగా రెండవవానికి చెప్పినట్టయితే వాని మనస్సు నొచ్చునని తెలసినప్పుడు ఆ సంగతిని గుప్తపరచి రెండవవాని భావమును గుర్తెరిగి మాటలాడవలెనని భావముగా నుండవచ్చును. గాని యిచ్చట సత్యమునకు విరుద్ధముగా నుండును. దీని అంతరార్థము యిటులనుండవచ్చును. వకసంగతియొక్క నిజస్థితి తెలసినప్పుడు రెండవవాడు దానినిగురించి అడిగినప్పుడు ఆ సంగతియొక్క నిజస్థితి వానికి చెప్పినట్టయితే వాని మనస్సు వ్యాకులమును చెందునని తోచినప్పుడు మౌనమును ధరించి ధన్యతనుందవలెనని భావము. గనుకనే మౌనముద్రచేత వాక్కువల్ల గలుగు కర్మము సహితము క్షీణించునని మౌనులు మౌనవ్రతమును అనుష్ఠింతురు. గాని రాజయోగసంధానులైన బ్రహ్మవేత్తలు తామరాకునీటియందుండి అంటీఅంటనట్లు నటింతురు గాన వారలకు యెట్టిదోషములు అంటనేరవు. సత్యమనగా పదార్థమునకు సమస్తవస్తువులయందును, సర్వకాలములయందును దానియొక్క విలువకు హెచ్చుతక్కువలు లేవుగదా! కాబట్టి వకపర్యాయము అసత్యమాడి జిహ్వను చెడగొట్టినమీదట. రెండవపర్యాయము భగవంతుని గుణాభివర్ణనము పాడుటకు యెటులతగును. గనుకనే పూర్వమందున ఋషులు తాపసులు మొదలుగాగల మహాత్ములు సత్యమును కాపాడుకొని మంత్రసిద్ధి, యోగసిద్ధి మొదలుగాగ

ల సిద్ధులను సంపాదించుకొని కీర్తిని శాశ్వతముగా ప్రకాశింప జేయుచున్నారు. సకల మహామంత్రములు పూర్వపు ఋషిప్రోక్తము లేగదా, అయినప్పటికిన్ని మన జిహ్వ చెడినందున అవి సిద్ధింపనేరవు అనగా సత్యము చెడినందున మంత్రసిద్ధి కానేరదని అర్థము. మంత్రసిద్ధిగాని యోగసిద్ధిగాని కలిగిన యెడల జ్ఞానము కలుగును. జ్ఞానమువల్ల నిజపదార్థముయొక్క గురుతు తెలుసును. నిజపదార్థముయొక్క గురుతు తెలసినందున ఆనందము కలుగును. అటువంటి ఆనందస్వరూపమును గాంచినమీదట అద్వితీయమగు పరబ్రహ్మము తానని తెలుసును. గనుకనే పరమాత్మునకు ఆనందస్వరూపుడని నామము గల్గెను. కాబట్టి సత్యము ప్రతివిషయమునకున్ను ఆధారభూతమై వున్నదని భావము. గనుక యిటువంటి సత్యమును కాపాడుకొనుటకు మనము సాధ్యమైనంతవరకు అభ్యాసము చేయవలయును.

# భూతదయ.

రెండవది భూతదయ:—

భూతదయ అనగా అనంతకోటిజీవరాసులయొక్క సృష్టి, స్థితి, లయములను తన మాయ అను విలువలేని కాలచక్రముచేత వినోదమును గావించుచున్న ఆ పరబ్రహ్మస్వరూ

పునిచే సృజింపబడిన పిపీలికాది బ్రహ్మాపర్యంతముగల జీవము లను సమదృష్టితో జూచుట అని అర్థము:—

పిపీలికముకంటె ప్రాణముగల చిన్నజీవము మన మాంసచక్షువులకు గన్పడునటువంటిది వేరొక్కటి నుండ నేరదుకదా? అంత స్వల్పజీవమునకు సహితము సుఖదుఃఖములు, ఆహార, భయ మైథున, నిద్ర జాగ్రత్త మొదలుగాగల అవస్థలు గలిగి యున్నవి. మరియు స్థూలశరీరముయొక్క నిర్మాణమును చూచినయెడల దానికి మనకు భేదము లేదు. సంకల్పవికల్పములును, జననమరణావస్థలును, అకాలమృత్యువులును నెంచి జూచినయెడల దానికి మనకు వ్యత్యాసము గాన్పించదు. శీతోష్ణస్థితులుకూడా సమముగానే నుండును. ప్రారబ్ధ, ఆగామి, సంచితము లనెడు కర్మత్రయములుకూడా దానికి మనకు సమముగానే ఫలములను పంచిపెట్టుచుండును. అదిగాక ప్రకృతిసంబంధమైన వ్యవహారములో సహితము చక్కగా పరిశీలించినయెడల లేశమైనను భేదము కాన్పించదు. యుగత్రయములలో సహితము దానియొక్క సృష్టి, స్థితి లయములకున్నూ అందుమూలముగా సంబంధించినటువంటి అంతర్బహిర్భేదములకున్ను తత్వమును యెంచిచూచినయెడల భేదమూందునని తోచదు. గనుకనే పిపీలకాది బ్రహ్మపర్యంతము యెంచిచూచినయెడల సమస్తజీవరాసులు పరబ్రహ్మస్వరూపమని నిర్ధారణచేయుటకు సందియమేల? ఇందులకుగాను వేమనా

ర్యులు యిట్లు వక్కాణించిరి. ౮॥ జీవిజీవిజంప శివునినేచంపు
ట జీవుడరసిచూడ శివుడుగాడె జీవుడే శివుడని సిద్ధంబు తెల
యరా ॥వి॥ మరియొక విశేషము కలదు. మనము ఆ శిపీ
కముయొక్క చర్య, వాక్కు మొదలుగాగలవి పరిశీలించినం
తటి సూక్ష్మజ్ఞానమును సంపాదించనందున భేదము వున్నటు
ల గాన్పించును గాని జ్ఞానచక్షువుతో గాంచినయెడల తత్వ
ముయొక్క గుట్టు బట్టబయలగును.

ఎటులననగా బురదలో పంకజము మొలచును. దానికి
దగ్గరనే మండూకము వసించును. భ్రమరము దూరముగా
నెక్కడనో వుండును. పంకజము వికసించినపుడనే భ్రమర
ము వాయువేగముగావచ్చి దాని మకరందమును గ్రోలి ఆనం
దించును. సమీపమున నున్న మండూకము బురదలోనుండి
యే ఆనందించును. అటివలెనే భ్రమరమనెడు జ్ఞానులు మక
రందజ్ఞానమనెడు ఆనందమును పొందుటకు యెంతశ్రమగలిగి
నప్పటికిన్ని విడువరు. మండూకమనెడు అజ్ఞానులు ప్రపంచమ
నెడు బురదలోనే వుండిదానిలోనే ఆనందించి జ్ఞానశూన్యు
లై వుందురు. కాబటి జ్ఞాననేత్రము విప్పినయెడల తత్వములు
యొక్క యదార్థము గాన్పించును. గాన్పించినచో భేదభావ
న తొలగును. భేదభావన తొలగినచో సమదృష్టి, దయ గలు
గును మరియు జడ అజడపదార్థములయందునకూడా పరబ్ర
హ్మస్వరూపము నిండియున్నది. ఎటులననగా పుష్పమునకు

బాల, యవ్వన, వార్థికదశలు కలవు. వాటిని మనము అతిసూక్ష్మజ్ఞానముతో గ్రహించవచ్చును.

ఇంకను వానికి సుఖదుఃఖములు జననమరణావస్థలు కూడా గలవు. పుష్పమును తీసి దాని రేకుమీదను చన్నీటిని చిలికినయెడల వకవిధమైన మార్పు గాన్పించును. తిరిగి వేడి నీటని చిలికినయెడల మరియొకవిధమైన మార్పు గలుగును. దీనివల్ల దానికికూడా సుఖదుఃఖములు గలవని సూక్ష్మజ్ఞానముతో గ్రహించసగును. పుష్పము మొగ్గగానున్నప్పుడు స్థితి, వికసించినప్పుడు వున్నస్థితి, వాడిపోయి రేకులపటుత్వముతప్పి క్రిందను పడినప్పుడు వున్నస్థితి వీటిని చూచినయెడల దీనికి కూడా బాలయవ్వన వార్థికదశలు గలవని నిర్ధారణ చేయవచ్చును. దీనికికూడా శీతోష్ణస్థితులు గలవు. గులాబిచెట్టు వక దేశములో బలముగలదిగాను, వాసనగలదిగాను, మరియొక దేశములో బలహీనముగాను, సువాసనతక్కువదిగాను యుండును. ఈమార్పులు ఆచెట్టుయొక్క పుష్పములకు గలుగుటకు కారణము శీతోష్ణస్థితులనియే గ్రహించవలెను. పైనుదవారించిన సుఖదుఃఖములు బాల, యవ్వన, వార్థికదశలు, శీతోష్ణస్థితులు గలిగినప్పుడు జననమరణావస్థలుకూడా ఆపుష్పమునకు గలిగియున్నవని చెప్పుటకు సందేహము లేదు.

మృత్తిక (మన్ను) దీనికికూడా పుష్పమువలె సుఖదుఃఖములు, బాలయవ్వన వార్థికదశలు, శీతోష్ణస్థితులు, జనన

మరణావస్థలుకూడా గలవు. మృత్తికను దెచ్చి దానిమీద నీటి ని పోసినయెడల వకవిధమైన భేదము కాన్పించును. ఆమృత్తిక మీదనే విస్తారముగా వేడినీరు పోసినపిమ్మట చిన్నమార్పు గలుగును. వేడినీరుగాని చన్నీరుగాని వేరే వకవిధమైన మృత్తికమీద పోసినయెడల వెంటనే దీనికికూడా గొప్పమార్పు గలుగును. దీనినిబట్టిచూడగా సుఖదుఃఖములు గలవనిచెప్ప వచ్చును. మరియు మృత్తికను వక్కచోట పెక్కుసంవత్సర ములువుంచి దానిని త్రవ్వినయెడల గాని స్పృశించినయెడల గాని దానికి మొట్టమొదట వున్నంతపటుత్వము తుదకు వుండ నేరదు. దీనినిబట్టిచూడగా దీనికి సహితము బాలయవ్వన వార్ధికదశలు గలవని చెప్పవచ్చును. మృత్తిక వకచోట వక రంగుగాను, కఠినముగా మరియొకచోట మరియొకరంగుగాను, మృదువుగాను వుండును. దీనినిబట్టిచూడగా దీనికికూడా శీతోష్ణ స్థితుల భేదముగలదని భావించవలెను. యివి గలిగనమీదట జననమరణావస్థలు గలవనుటకు లేశమాత్రమైన ఆటంకము గలుగనేరదు. కాబట్టి స్వకీయమగు త్రిగుణాత్మకమైన మాయ తో సృష్టి, స్థితి లయములకు గారణభూతుడైనట్టి పరబ్రహ్మ ము సర్వమందున నిండియున్నాడనుటకు సంశయమేల?

ఇది యిటులనుండగా గొందరు మానవులు "ఆత్మవత్స ర్వభూతాని అహింసా పరమోధర్మ" అన్నవాక్యములను పాటించకుండా దయావిహీనులై, యింద్రియములోలులై, కర్మా

ను బద్ధులరై జీవములను. దేవతులకు బలియిచ్చుటయందు చాలా అసక్తిగలవారలై యున్నారు.

ఆదేవతలు వారలయొక్క పూజలను, బలులను అంగీకరించి వారలకు శ్రేష్ఠమైన జన్మములను యిహామందున పరమందున లభింపజేసి ఖ్యాతిని జెందించునని తలంచియున్నారు. యిదియెంతవరకు వాస్తవమో తత్వమును పరిశోధించిన యెడల బయలుపడును. తల్లికొడుకులను బలిగోరునా? అటువలనే భగవంతుడు సమస్తజీవరాసులను సృజింపజేసి తనయొక్క దయను సమముగా ప్రతిజీవరాసియందున స్ఫురించి సమదర్శియై యున్నప్పుడు జీవములను బలిగా అంగీకరించి మూఢమానవులయొక్క గోర్కెలను సఫలతనొందించుననుట అనుమానాస్పదము. అదిగాక పరబ్రహ్మస్వరూపమే వివిధమైనటువంటి రూపునామములతో పిలువబడుచున్నప్పుడు దేవతలు సహితము పరబ్రహ్మస్వరూపులనియే భావించవలసినది. యిటువంటి పరబ్రహ్మస్వరూపులరగు దేవతలు బలినిగోరి ఆనందింతురా? మరియు పరబ్రహ్మమునకు ఆనందస్వరూపుడనికూడా నామముగలదుకదా! అటువంటి ఆనందమయుని యొక్క స్వరూపులరగు యీదేవతలు యెటులజీవములకు హింసను కలుగజేసెదరు. ఇందులకు వేమనాచార్యులుగారు యిట్లవక్కాణించిరి. క॥ జీవిజీవిజంపి జీలిక వేయుగా। జీవివలనబలిసి చెలగుచుండు। జీవహింసకులకు జిక్కునామోక్షంబు॥వి॥

ఇది యిటులనుండగా మనుజుడు తాను జేసుకున్న కర్మముల
ను నివర్తి జేసుకొనుటకు యితర జీవములను బలియిచ్చినంతి
మాత్రమున నివర్తి యగునా? దీనికి చిన్న వుదహారణము:—

ఒకమనిషి దొంగతనము చేసినప్పుడు రాజాధికారులు
వానికి శిక్షను విధించుదురుగాని యింకొకనికి విధించరుగదా!
అటువలెనే యెవరుచేసుకొన్న కర్మ వారు అనుభవించవలెను.
గాని జీవములను బలిగాయిచ్చినచో ఆకర్మ యెట్లుతొలగును.

మరికొందరు యజ్ఞఫలాపేక్షులై తత్ఫలముగా లభిం
చిన సుఖములను ఆనందింపగోరుచున్నారు. ఆయజ్ఞములు
అయిదువిధములు, బ్రహ్మయజ్ఞమనియు, దేవయజ్ఞమనియు,
భూతయజ్ఞమనియు, పితృయజ్ఞమనియు, మనుజయజ్ఞమనియు,
భాగింపబడినవి, వానిలో అధ్యాపనాధ్యయనములు బ్రహ్మ
యజ్ఞము, హోమాదిక్రియలు దేవయజ్ఞము జంతువులకు బలి
యిచ్చుట భూతయజ్ఞము అన్నోదకములచేత తర్పణములు
నిర్వర్తించుట పితృయజ్ఞము. అతిథులన భ్యాగతుల నాదరిం
చుట మానుషయజ్ఞము భూతయజ్ఞమునకు నొక్కదానికే
బలిప్రధానమైనదని తెలియవచుచున్నది. మంత్రశక్తిచే మృతి
జెందిన పశువును జ్యోతిష్టోమము చేత భస్మముచేసి ఆభస్మ
మును అన్నాదికములయిన పదార్థములతో జేర్చి బ్రహ్మాదిదే
వతలకు అగ్నిముఖమున హావిర్భాగములనొసంగి వారిని తృ
ప్తినొందించి మిగిలినది దాను స్వీకరింపవలెను. మృతిజెందిన

పశువును మరల మంత్రశక్తిచే బ్రతికించవలెను, లేకున్న దానికి పరలోకమున నుత్కృష్టపదవి అయినసిప్పించవలెను కాబట్టి నిగ్రహానుగ్రహ సమర్థతగల మహానుభావులే భూత యజ్ఞమున కధికారులుగాని తదితరులు కానేరరు. అట్లుచేయని పక్షమున ఘోరనరకమునకు పాత్రులగుదురు. కేవలము మ ధ్యమాంసములయందు యిచ్ఛగలవారికిన్ని గ్రామ్యము లైన కామ్యములను గోరెడివారికిని భూతయజ్ఞము అవశ్యకర్తవ్య ముగాని తదితరులకు ఫలకారి కానేరదు. అంతకష్టపడి తుద కాయజ్ఞమును తుదముట్టించినను, శాకిని, ఢాకిని మొదలగు భూతములకు సంతుష్టికలుగుటతప్ప మరియొక విశేషలాభ మేమియు లేదు. భూతయజ్ఞములు జేసెడివారు పామరులనియు ముముక్షువులైనవారికి యిది విసర్జనీయమనియు నావేదము నందే నిషేధముసహితము వ్రాయబడియున్నది.

మరికొందరు మానవులు భగవన్నామోచ్చారణచేసి పశుహింసచేసినచో పాపము ఘటిల్లదని నమ్మికొనెదరుగాని, అది యెట్లగును; యేలననగా త్రికరణశుద్ధిగా పాపపరిహారము నిమిత్తమే భగవంతుని స్మరించుట న్యాయముగాని, దీనికి వ్యతిరేకముగా పాపకర్మమును ఆచరించునప్పుడు భగవంతుని స్మరింప వలసినదనుట వింతగానున్నది. యీవిషయములనెల్ల నామూలాగ్రముగా పరిశీలించినచో జీవహింసభగవన్నియ తమయినట్టుతోచదుగాని జిహ్వాచాపల్యముచేత పీడింపబడిన

మహానుభావుడెవడో యీరీతిగా వ్రాసినాడని విశదమగుచున్నది. యీజన్మమున దేవతలకు బలియిచ్చిన జీవములు మరియొక జన్మములో మనకు శత్రురూపములుగా జన్మించి మనలను యేదోవకవిధముచేత తప్పక బలి నిమిత్తమైగురిజేయును. ఎటులననగా యింద్రియములు విషయముల యందాసక్తిగలిగి వాటిని సంగ్రహించి, వాటివలనగలుగు ఫలములను గుర్తెరుగక కర్మసంచయమును వృద్ధిచేసుకొనుచు అనుభవించినంత అనుభవించి, శేషమునుమరియొక జన్మమందున అనుభవించును. గనుక నేశో॥"జన్మాంతర కర్మఫలమవశ్యభోక్తవ్యం కృతక కర్మ శుభాశుభః॥ అని పెద్దలు వక్కాణించుతురు గాబట్టి మన మేమరల బలికిపాత్రులముగాకను. వకజన్మమందున తప్పినను, మరియొక జన్మమునైనను తప్పదు. గానమనుజులు అతిజాగరూకులై హృదయాకాశమందున దయావృష్టిని నెడతెగకుండా సమస్త జీవరాసులయందున భేదభావన లేకుండా వర్షింపజేయుటే భూతదయఅని పెద్దలు పలుకుదురు.

తనకు గల్గిన సుఖదుఃఖములు మానాభిమానములు, కామవికారములగు గుణములు యెదుటవారికికూడా వున్నవని భావించి సమస్తప్రాణులయందును అంతర్యామి యొక స్వరూపుడు వక్కడేగాని భిన్నుడుగాడని దలంచి జీవకారుణ్యము గలిగి వర్తించవలెను. సూర్యుడు యెటువలె సమస్త జడ, అజడపదార్థములమీదను తనయొక్కకిరణములను సమముగా

ప్రకాశింప జేయుచున్నాడో అట్టివలెనే మానవులు భేదభావములేకుండా సమదృష్టిగలవారలై సమస్తభూతములందున సర్వకాలములందున వర్తించవలెను. మరియు "అహింసాపరమోధర్మ" అనువాక్యమును పెద్దలువక్కాణింతురు. అనగా భగవంతునిచే సృజింపబడిన జడ అజడపదార్థములయొక్క మనస్సును లేశమాత్రమైనప్పటికిన్ని నొప్పించకుండావుండుట పరమధర్మమని యర్థము.

ఇది యిటులనుండగా ధర్మవ్యాధుడు యిట్లు వివరించెను. లోకములో యెల్లవారును తమతమ దేశాచార, కులాచార, [illegible]చారధర్మములకు లోపము రాకుండా నడచుకొని సత్కర్మములనాచరించుచు అత్యాశచే పీడింపబడి యకార్యకరణ[illegible] ప్రవేశింపక. పరవసితాపరాఙ్ముఖులై, ధనప్రధానాదిసత్కారములచే బంధు భృత్య, మిత్రవర్గముల నిత్యము ఆదరించుచు, లభించినదానితో తృప్తిజెంది, లభించనిదానికొరకు చింతించక మాయామోహినోపకడగు భగవంతుని లీలయని భావించి సర్వభూతములయందున సమభావోపేతుడై యుండవలెను. దీనికి వుదహరణము.

పూర్వము జనకచక్రవర్తి సమస్తభోగభాగ్య బంధు మిత్ర కళత్ర పుత్ర రాజ్యము మొదలగు యిహసుఖములు యెన్నిగల్గినప్పటికిన్ని ధర్మమార్గముతప్పక జాతివిక్షణలేకుండా. సకలజాతులను, సకలమతములవారిని, యేకభావనగల్గి పాలిం

చుచు, దీనిలో నెవ్వరైనను స్వధర్మములనుగాని, యాను పూర్విగా వచ్చినధర్మములనుగాని, నీతులనుగాని విడచి వ్యతి రేకముగా ప్రవర్తించినవారలను శిక్షించుచు "అహింస" యన్న వ్రతము ననుష్ఠించుచు రాజ్యమును పాలించెనుగదా! గను క తమతమకు సాధ్యమయినంతవరకును, జీవహింసచేయక తొలగవలసినదిమాత్రము ముఖ్యకర్తవ్యము. అట్లు తొలగుట యే అహింసయని చెప్పబడును.

మూడవది పరదారాధనవిసర్జనము:—

# పరదారాధనవిసర్జనము.

అనాదిగావున్న జీవుడు యావజ్జీవపర్యం పాపకర్మసంచయము సంచితమనబడును. ఆసంచితములో కొం తభాగమే పునర్జన్మమునకు హేతువై పాంచభౌతికశరీరమును గల్పించి సత్కర్మదుష్కర్మానురూపములయిన సుఖదుఃఖము లనుభవింపజేయును. యిదియే స్థూలశరీరధారణకు కారణమై స్త్రీపురుషజన్మాదులకు ఆదిభూతమై యుండును.

సమస్త దేవతాప్రీతిగాను, భగవదాజ్ఞానుకూలముగాను చిన్నపెద్దలసాక్షిగాను సత్యమనెడు ప్రమాణములోను మంగ ళసూత్రమనెడు వస్తువును పురుషుడు స్త్రీమెడయందు గట్టు ను. గట్టిననిమిషమునుంచియే ఆమె ఆయనకు భార్య అని

మునుబట్టి వారివారికి తగినట్టువంటి పురుషులకు స్త్రీలు స్త్రీలకు పురుషులు లభించుదురు. మంగళసూత్రధారణ యనెడు పిలువబడును. సంచితములో నెవరెవరు చేసుకున్న ప్రారబ్ధమాట ప్రమాణముగాన దీనికి వ్యతిరేకముగా పురుషుడు స్వస్త్రీనిగాక యితరస్త్రీనిగోరుట పరదారాగమనమని పేరు. యిది గలుగుటకు కారణములు పెక్కులుగలవు.

మోహాంధకారమయిన మనశ్శక్తిచేతను ద్రిక్తమగు మన్మధపిశాచ మావేశమయినప్పుడు మానినులపైని చింతపా యీచింతచే కుందినవారలకు యౌవనోన్మదముచేత గలిగి మన్మధుడేపరబ్రహ్మముగాను స్త్రీలే కృపాస్య నారీపలుకులే వేదవచనములుగాను, శృంగార లే పురాణవత్తులుగాను, నటవిటగాయకవిదూష కులే మహాపండితులుగాను తమబుద్ధికి తోచినదే ప్రమాణము గాను స్త్రీభోగమే రాజయోగముగాను విషయానందమే బ్రహ్మానందముగాను దోచుట సహజము. అగ్నిగుండము దాపున నేతికుండవున్నరీతిగా స్త్రీలవద్ద పురుషులున్నపక్షమున ధైర్యముకరిగిపోయి కామవికారముగలుగుట సహజమేగాని, వెలదులపొత్తు లభించకపోయిన మొదల ప్రాణములకు హానికూడా వకానొకవేళలందున సంభవించును. అగ్నిచే కాల్పబడుశరీరములకు ఔషధముచే శాంతిగలుగునుగాని మన్మధపిశాచ

ముచే శాల్పబడుశరీరములకున్ను మనస్సులకును నుపశాం తి లేదు.

మనోనిగ్రహము లేనివానికి పశ్చాత్తాపమొక్కటే ముఖ్యప్రయోజనము కాని మరియొక ప్రయోజనము లేదు. మరియు యిటువంటి మన్మథపిశాచముచే పీడింపబడుచున్నవారు మానినులవల్ల గలుగు సుఖములలో మునిగి పైనుదహరించిన రీతిగా భావించెదరు గాని యింద్రియముల యొక్క నైజగుణము లను గుర్తెరిగి వాటివల్ల గలుగుకర్మములను గ్రహించి, నిదానించిన యెడల యీాదిగుననుదహరించిన విషయములే యథార్థములని భావించవచ్చును. యౌవనావస్థయందు ప్రచారములకు ముఖ్యస్థానమని గౌరవింపబడిన [illegible] గమునందు నేది రమణీయమైనదో దెలియకున్నది. [illegible] నందు ఆడుకొను యచేతనములయిన ప్రమానిబొమ్మలుచంద మున యౌవనమునందు సచేతనములయిన యీచర్మపుబొమ్మ లును లీలావిహారయోగ్యములయి యుండును. ప్రమానిబొమ్మ లను యంగచ్ఛేదనముచేసి చూచినచో వానియందు సేవగించు కొనుటకు దగినవిషయము లేమియు గనబడవు. యౌవన వంతములయిన యీచర్మపుప్రతిమలను చూచినమాత్రముననే సర్వాంగములయందున మిక్కిలి యసహ్యాకరములయినమల ములు పెక్కులునిండియుండుట కనబడుచున్నది. కాబట్టి విచారజ్ఞానశూన్యతచేత నెంతయు రమణీయముగా దోచెడి

యీచర్మమాంసములయందు మిక్కిలి యనురాగముగలిగించు యౌవనముకంటె ప్రమాదిబొమ్మలయం దనురాగముగల్గించు బాల్యమే సర్వోత్కృష్టమైనదని నిశ్చయింపవలసినది.

అదిగాక మేదో, మాంస, చర్మ, రక్తా స్థి, మజ్జా, స్నాయువు, రేతస్సులతో నెల్లయంగములు నిండియున్నవనియు చక్కగా గుర్తెరిగియు వాటియందు నసహ్యాపడక చంద్రుడు మొదలగు దివ్యపదార్థోపమానములచేత నవయవముల నత్యంతరమణీయములుగా నభివర్ణించుచు నేకారణముచేత స్త్రీలను భోగించుచున్నారో వూహింప సాధ్యముగాకున్నది. పరిమళవస్తు వస్త్రభూషణాదులచేత మానవులయొక్క తనువులనే [illegible]ములు మాటిమాటికి శోభింగాంచునో ఆయంగములే తుదకు కాకుల గ్రద్దల పాలయి చీకాకుపొందును. మేరుపర్వతముయొక్క శిఖరమునందు ప్రవహించుచున్న గంగాప్రవాహమువలె ముత్యాలసరములే స్త్రీలయొక్క స్తనముల మీద నలరుచున్నవో యట్టి స్తనములు కడపట కుక్కలు, నక్కలు మొదలగువానికి బండములగుచుండును. గాడిదలయొక్క దేహములవలె మానవులయొక్క దేహములును మాంసరక్తాస్థిమయములయి యుండగా నాదేహములు వికారములనియు నీదేహములు సుందరములనియు దలంచుటకు నజ్ఞానమే ముఖ్యకారణము.

మదము నుద్రేకింపజేయు విషయమున మద్యపానము ను, మదవతియు సమమే యయినను మద్యము త్రాగినమాత్రమే మత్తుగలిగించుటవలనను త్రాగగాగలిగిన మత్తు సహితము కొంచెముసేపుండి మరల దిగిపోవుటవలనను చూచిన మాత్రమున మత్తుగలిగించి చిరకాలము పీడించునట్టి స్త్రీకి సమానము కాదని యేనిశ్చయించవలసినది పాపమనునగ్ని హోత్రమునకు ప్రచండజ్వాలలగుచు, నరక మనునగ్ని హోత్రమునకు నింధనములగుచు, దుఃఖమను నగ్ని హోత్రమునకు మిడుగురులగుచు, తళుకు బెళుకులను జూపికులుకుచు, మరులను నురులొడ్డి, యడ్డములేక లోకము మోహింపజేయు వనితలు నిస్సంశయముగా నగ్నిమయప్రతిమలు గనుక వారిని జూచినను తలచినను పురుషులయొక్క హృదయములు దహనమైపోవును. అదియుగాక నకులుడు నిట్లు వక్కాణించెను :—మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్, ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి". అనగా పరస్త్రీని తల్లివలెను, పరద్రవ్యమును మంటిపెళ్లవలెను, సకలభూతములను తనవలెను యెవడుచూచునో అతడు బ్రహ్మజ్ఞానియగునని చెప్పెను. యిచ్చట వచించినది బ్రహ్మజ్ఞానులకుగాని యిప్పుడు కలియుగబుద్ధిమంతులకుగాదని తాత్పర్యము కాదు :—

బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు మనుజుడు అతిజాగరూకుడై ప్రతివిషయమందును ప్రతినిమిషమందున అతిశ్రద్ధ

వహించి పాటుపడినచో బ్రహ్మజ్ఞానసంపద చేకూరును. యిదియుగాక పరస్త్రీగమనమువల్ల యిహామందున కూడ మానహానిగలుగును. యిందుకు నీతిశాస్త్రమందున యిట్లు చెప్పెను. "దాసీ మానధనంహంతి హంతి వేశ్యాధనాదికం ఆయూంషి విధవాహంతి సర్వంహంతి పరాంగనా" అనగా దాసీసంగమము మానము పోగొట్టును. వేశ్యాసంగమము ధనాదులపోగొట్టును. విధవాసంగమము ఆయువునుక్షీణింపజేయును. పరాంగనాసంగమము అన్నిసుగుణంబులను బోగొట్టును. గాన తత్వము విచారించినయెడల అణుమాత్రమైన సుఖముగాని, మానప్రకాశముగాని యిహామందునగాని పరమందునగాని వున్నట్టు కాన్పించదు. యిదియిట్లులనుండగా పరదారాధనప్రియులకు వారలు పొందినకష్టములకు పరిమితిలేదు యిచ్చట కొన్నిటినిమాత్రము వుదహరించెదను.

పరస్త్రీనిగోరినందున పఙ్త్తిముఖుడు పుత్రబంధుమిత్రసహితముగా సమరమందున సమసిపోయెను. పరస్త్రీమీద కన్ను వేసినందున చతుర్ముఖుడు తలబోగొట్టుకొన్నాడు. పరస్త్రీనిమోహించినందున నహుషుడు పదభ్రష్టుడై క్రిందబడి కొండచిలువయయినాడు. పరాంగనా సంగమమువలన శీతకరుణుడు క్షయరోగపీడితుడయినాడు. పరస్త్రీని పట్టదలచినందున బోయవాడు భస్మమయినాడు. పరస్త్రీని చెరుపబోయి కీచకుడుపరలోకగతుడైనాడు. దుర్యోధనాదులు తమకు కర్మానువశము

గ ప్రాప్తించిన రాజ్యసుఖముచేత సంతోషించక దురాశాపిశా
చగ్రస్తులైనందున తమ రాజ్యము సుబంధుమిత్రపుత్రపరివారము
తో సహితము సమరమందున గూలిరి. నిక్కము ఆలోచించిన
చో పరదారాగమనమువలన లేశమైనను సుఖము జీవునకు
చేకూరునని నిశ్చయించుటకు వీలులేదు. కాబట్టి ప్రాణులుస
దా అపరిమితమైన దుఃఖములకు ప్రాప్తులగుచు లెక్కలేని పె
క్కుయోనులందున బుట్టుచు విశ్రాంతి అన్న వచనమును కలలో
సహితము గానలేక పరితపించెదరు. దీనికి కారణము యింద్రి
యములు వృత్తులయందు ప్రవేశించి విషయ సుఖములయం
దాశక్తిగలిగి మనస్సును లోబరచుకొనుటయని యూహించవ
చ్చును.

యిది యెటులజరుగునన యింద్రియములు రజస్సత్వ
తమోగుణములతో కూడుకొని విషయసుఖములయందాస
క్తిగలిగి వాటియొక్క పూర్ణశక్తిని విజృంభణముచేసి మనస్సు
ను ప్రతిఘడియయందున వాటివలలో వేసుకొనుటకు ప్రయ
త్నించుచుండును. అప్పుడు బుద్ధియనునది దానియొక్క సలహా
ను పెడచెవినిబెట్టినటువంటి మనస్సును జూచి యేమియు చే
యజాలక ప్రత్యేకముగా వేరేనిలుచుండును. తుదకు బుద్ధియొ
క్క సలహాను చెవినిబెట్టక యింద్రియములయొక్క భుజాబలము
వల్ల మనస్సు వాటికిలోబడి అకార్యమైనటువంటి కర్మముల
ను జేయుచు లెక్కలేని పెక్కుజన్మములు యెత్తుచుండును.

బుద్ధికి మనస్సులోబడిన యెడల కర్మసంచయమను వృక్షము దిన
దినము వృద్ధిపొందుటకు అవకాశము కలుగనేరదు. మనస్సు
బుద్ధికిలోబడియుండుటకు కొన్ని సాధనములు గలవు. అవియేవ
నన:—ఆహారము, స్నేహితులు, గ్రంథపరిచయము, పెద్దలసే
వ, శ్రవణము, మననము, నిధిధ్యాసము.
యీపైనుదహరించిన వాటిని క్రమక్రమముగా అభ్యాసమునకు
తెచ్చినయెడల బుద్ధికి మనస్సులోబడి, యింద్రియములు విష
యసుఖములందు దాసక్తిని విడిచి, మనస్సుతో స్నేహమును
చాలించుకొనును. పిమ్మట మనస్సునకు బుద్ధియొక్క సలహా
ను వినుటకు అవకాశము గలుగును. కనుక వాటిని క్లుప్తముగా
వివరించెదను:—

ఆహార పదార్థములలో రజస్సత్వతమోగుణములను
పుట్టించుశక్తి గలదు. వాటిలో సత్వగుణమును పుట్టించు ఆహార
పదార్థములయందు దాసక్తి గలిగియుండవలెను.

స్నేహితులు రెండువిధములు:— బహిరంగస్నేహి
తులు, అంతరంగస్నేహితులు. బహిరంగస్నేహితులు సర్వదా
ప్రపంచవ్యవహారములయందు దనురాగముగలిగి వారు చేయ
బోవు కర్మములయొక్క లాభనష్టములను ఫలా, విఫలముల
యొక్క విలువను అనుసరించి, వారలో సఖ్యమొనర్చిన
స్నేహితులను సహితము వారియిష్టములకు పాత్రులుగా జేసు
కొందురు:—

యీవిధముగాను వారలు కర్మాపేతులై, లెక్కింపరాని కర్మములను చేయుచు, యింద్రియలోలురై, అమూల్యమైన కాలమును పోగొట్టుకొందురు. యిది యెటులననగా ఒకపిచ్చివాడు ఒకగృడ్డివానిని మంచిచిత్రములుగల నగరులోనికి తీసుకొనివెళ్లి అచ్చటనున్నవానిని గాంచి తాను మిక్కటముగ మతిభ్రమనుజెంది పిచ్చి మరికొంతఅధికమై గృడ్డివానిని విడనాడినందున గ్రుడ్డివానికి త్రోవ తెలియక ఏదోవకగోడమీదనో లేక బొమ్మమీదనో యెటుల పడునో అదేప్రకారముగా వీరుభయుల స్నేహము తుదకు పరిణమించును.

అంతరంగసంబంధమైన స్నేహముగల్గిన యెడల బంగారమునకు వన్నెపెట్టినరీతిగా ఒకరియొక్క స్నేహమువల్ల మరియొకరు ప్రకాశించుచుందురు. కాంతము యెటుల లోహమును తనవైపులాగుకొనునో అదేవిధముగ అంతరంగచింతగల స్నేహితుడు తనస్నేహితునియొక్క మనస్సును సదా మంచిమార్గమునందు మెలగునటుల జేయును.

యింద్రియములు లోకవేళయందున, తమయొక్క పరాక్రమముచేత, మనస్సును స్వాధీనముజేసుకొని, నిరంతరము దుఃఖమునుప్రసాదించు కర్మములయందు ప్రవేశించకముందే తనస్నేహితునియొక్క మనస్సును బహిర్ముఖమునుంచి అంతర్ముఖమునకు త్రిప్పి వానికి బుద్ధియొక్కవిలువను అనేకరీతుల నొక్కివక్కాణించి, వానిని ప్రతిక్షణమందు గడతేరుమార్గ

మునందు ప్రవేశింప నిచ్ఛగలవాడై ధేనువునిచాయని దూడ వలెను, పున్నమరాత్రులందున చంద్రునిఛాయని చకోరమువలెను, వర్షఋతువు పొడచూపునపుడు మేఘములను ఛాయని చాతకపక్షివలెను, సదా వీరిరువురు కలసివర్తించి, అంతరంగ స్నేహమనెడు పుష్పముయొక్క సువాసనను నలువైపుల సుగంధించునటుల జేయుదురు. యెటులననగా దాహముచేత పరితపించుచుండు చకోరపక్షి చంద్రకిరణములు రావేగమే వాటియందుగల హిమమును గ్రోలి దాహమును దీర్చుకొనినను, చంద్రుడు చకోరముయొక్క దాహమును తీరెనుగదా యని తనకాంతిని తగ్గించుటగాని, లేక తాను అస్తమించుటగాని గలుగక, ఆచల్లనికిరణములను నలువైపులప్రకాశింపజేసి చల్లదనమును కాంతిని గలిగించునటుల జేయునుగదా? అటువలెనే వీరిరువురస్నేహమువల్ల యితరులుకూడా చాలామంది అంతరంగమనెడు పుష్పముయొక్క వాసనను గ్రహించి ఆనందమనుభవించుచుందురు.

గ్రంధపరిచయము:— పూర్వము భక్తుల ముక్తుల, సిద్ధుల, సాధ్యులయొక్క జీవితములవల్ల వారలయొక్క, వున్నతస్థితులు యేరీతిగా వారలకులభించినవో అవి యేయే, కర్మజ్ఞాన, వైరాగ్యభాగ్యములవల్ల చేకూరినవో అవిఅన్నియుచక్కగాగుర్తెరుగుటకు అవకాశముగలుగును. ఎటులననగా మనస్వరూపమును జూడవలెనంటే మనకంటితో జూడలేముగాని

అద్దమువున్న యెడల మనస్వరూప మిట్టిదని జూడగలము. అటు వలెనే గ్రంథమనెడు అద్దముతో ఆత్మయొక్క నిజస్వరూప స్థితి తెలుసును గాన గ్రంథావలోకన ముఖ్యకర్తవ్యము. తదుపరి సదా యిటువంటి గ్రంథావలోకనమువల్ల యీచంచలమైన మనస్సునకు నిజస్థితి కొంతమట్టుకు, అలవడి యింద్రియముల యొక్క గారడీవిద్య బాగా తెలసి, బుద్ధియొక్క సలహా మంచిది కదాయనితోచి, గ్రహించినదానిని అభ్యాసమునకు తేవలెనని ప్రయత్నపడును.

పెద్దలు అనగా జ్ఞానులు:—రాగద్వేషాదుల బారదోలి, యింద్రియవికారముల నణచి, మనస్సనెడు కుక్కను కట్టిపెట్టి, బుద్ధిఅనెడు మంత్రియొక్క సలహాను చెవినిబెట్టి, కాలత్రయములను గుర్తెరిగి, గమనాగమనములయందు యేకరీతిగా మనస్సును చలింపక నివాతదీపమువలె స్థిరపరచి ఆనందమనెడు జ్యోతిప్రకాశమును దర్శించుచు, సదా బ్రహ్మానుసంధానులై వున్నవారలని భావము. అటువంటివారల సేవచేసినయెడల సంశయనివృత్తిగలిగి తత్వవిచారణ క్రమక్రమముగా పొడచూపి, యింద్రియములను విషయములయందు చొరనీయక బుద్ధియనెడు పగ్గముచేత గట్టిపెట్టి సదా వారలసేవవల్ల లభించినదానిని శ్రద్ధతో గ్రహించి దినదినము జ్ఞానమనెడు దీపమును సంపాదించుకొనుటకు అవకాశము గలుగును.

శ్రవణమనగా:—సకల చరాచరరూపమైన ప్రపంచమంతయు నిరంతరము చూచుచు సర్వసాక్షిగానున్న పరబ్రహ్మమునకును, తనకును భేదములేదన్ని తెలియజేసెడు మహావాక్యములయొక్క రహస్యార్థమును సద్గురుముఖముగా వినుటయే శ్రవణమనబడును.

ఆ శ్రవణమువల్ల బుద్ధిని ఆవరించుకొనియున్న చీకటియనెడు అజ్ఞానము జ్ఞానమనెడు సూర్యప్రకాశముచేత నశించిపోవును. ఇది యిటుల నశించినతోడనే దేహమనిత్యమనియు తాను నిత్యమనియు, యింద్రియములు దుఃఖమయములైనవనియు తాను ఆనందమనియు, అంతఃకరణములు చలనశీలములనియు తాను నిశ్చలమనియు, దేహమునకు ప్రాణము ఆధారమనియు, తాను తుర్యమునకు ఆధారమనియు, జీవుడహంభావమనియు, తానవహంభావమనియు, అజ్ఞానము కేవల శూన్యమనియు, తానఖండపరిపూర్ణమనియు, నిరంతరము మనస్సును సమాధానమునకు తెచ్చుట మననమనబడును. ఇది దృఢమైనతోడనే చవిటినేలను విత్తిన విత్తనములవలె సందేహములు తలయెత్తక నాశమగును. సందేహములు నాశమయినగూడట దేహాదిప్రపంచమునకు దానన్యముగానుండుటవలన తనకు కాలత్రయములయందును యెల్లప్పుడు ధర్మాధర్మములు, బంధమోక్షములు, జరామరణములు మొదలగునవి యేవియు లేవనియు, జలకణములు పెక్కులొక్కటిగ గూడి ప్రవాహమై

నట్టు సమస్తసాక్షులకూటస్థే సర్వసాక్షియైన పరబ్రహ్మమని
యు, సాక్షిమాత్రముగా వెలసెడు పరబ్రహ్మమే తానని యు
జననమే లేని మరణమెక్కడదనియు, రూపములేని తనకు వికా
ర మెక్కడదనియు, సంకల్పమే లేని తనకు వికల్పమెక్కడ దని
యు, నెందును పూర్ణముగా నిండియున్న తనకు దిగ్దేశవ్యవస్థ
యెక్కడదనియు, కాలత్రయమునందు నక్కరీతిగానున్న తనకు
కాలభేదమెక్కడదనియు, నిత్యమై సత్యమైయున్న తనకు జాల
విద్యవలె మిథ్యమయిన యీప్రపంచమెక్కడదనియు, అద్వయం
త పరబ్రహ్మము తానని నిస్సంశయముగా తెలుసుకొనుట నిధి
ధ్యాసమనబడును. తత్వమిటులనుండగా కొందరు కలియుగ
బుద్ధిమంతులు కొన్ని శాస్త్రములను గ్రంథములను శోధించి,
మెట్టవేదాంతములను కొన్నిటిని బాహ్యావేషధారులగు బోధ
గురువులవల్ల సంగ్రహించుకొని, వాటిని మనస్సులందున పా
దుకొల్పుకొని పూర్వము పరాశరులవారు చెంబెడిదానితో
సంగమించలేదా, విశ్వామిత్రుడు మేనకతో రతిసుఖమనుభ
వించలేదా, వారలకు జెందని పాపము మనకు యెటులజెందు
ననిన్నీ, పూర్వమునుంచి యీవ్యభిచారదోషములు అంతగా
నిషేధించబడలేదనిన్నీ మనస్సునకు సమాధానము చెప్పుకొ
నుచు, యింద్రియలోలురై వ్యభిచారమును తృణప్రాయము
గా నైన నెంచరు. పరాశర, విశ్వామిత్రాదులు చేసిన తపము
లు, మనోబంధనములు మొదలుగాగల కార్యములు యోచిం

చి చూచినయెడల, వాటిలో అణుమాత్రమైనను సలుపుటకు యీ కలియుగ బుద్ధిమంతులచేత కానేరదు. ఏలననగా, వార లు యున్న యుగములు, వారలయొక్క ప్రాణధారణస్థితి, ప్రాణముయొక్క పరిమితి, వారి కాలములోయున్న యోషధు లయొక్క శక్తి, వారలకు గలిగిన త్రికరణశుద్ధి మొదలుగాగల వి వీరలందున సహస్రాంశమైనను గానరావు.

యీ దురాచారమైన వ్యభిచారమునందు మాత్రమే వారలతో సరిపోల్చ నూహించెదరుగాని వారివలె త్రికరణ శుద్ధి, తపః ప్రభావము, జ్ఞాన సంగ్రహము మొదలుగాగల మంచి క్రియలను అభ్యాసమునకు తెచ్చుకొనిన మీదటగదా, వారితో సమానులమనియు, వారలకు జెందని దోషములు మాకు సహితము జెందవనియు నిర్ధారణ చేయనగును. నిప్పు దాని వేడిమిని పోగొట్టుకొనజాలనటులను, చక్కెర దానిమా ధుర్యమును పోగొట్టుకొనజాలనటులను, వ్యభిచారము దాని దోషమును పోగొట్టుకొనజాలదు. స్వతస్సిద్ధమైన నైజగుణ ములు జడపదార్థములనుగాని అజడపదార్థములనుగాని విడువ జాలవు. గనుకనే విశ్వామిత్రాదులు మాత్రము యీ వ్యభి చార దోషమువల్ల సంగ్రహించుకొన్న కర్మములను తప్పించు కొనజాలిరా? స్త్రీకి పురుషుని నిమిత్తము గల్పించుట ప్రజో త్పత్తి నిమిత్తముగాని రతిసుఖము కొరకు గాదు. యిందుకు వ్యతిరేకముగా కామోద్రేకముచేత రతిసుఖముకొరకు గోరు

ను. యిటువంటి రతిసుఖము ప్రతి స్త్రీయందున యేకవిధము గానే అనుభవింపనగును. రూపు రేఖ విలాసములు మాత్రము భేదముగా గాన్పించును. యిటువంటి రూపురేఖ విలాసముల భేదము రతిసుఖమును యేవిధముచేతగాని మార్పు జెందింప నేరదు. యిది యిటులనుండగా పురుషుడు యింద్రియవ్యాపారములకు లోబడి, మనస్సును చంచల స్వభావమునకు దించి స్వ స్త్రీ కంటెను పర స్త్రీ యొక్క రూపు రేఖ లావణ్యముల నపేక్షించి మోహాభ్రాంతుడై, యింద్రియలోలుడై వ్యభిచార దోషమునకు పాత్రుడగుచున్నాడు. గనుక పురుషుడు జ్ఞాన శూన్యుడై యింద్రియ వికారములచేత గలుగు యీ మోహము దోషమును మనకుసంపాదించిపెట్టును గదాయని యెరుగజాలక, దీపముసుజూచి భ్రమను జెంది ప్రాణములను గోల్పోవు పతంగములవలె యింద్రియ సుఖములను జూచుకొని యీ వ్యభిచారదోషమును సంగ్రహించుకొనును. సర్వ విధముల యోంచి చూచినయెడల పురుషుడు స్త్రీకంటె బుద్ధిబలమానందు యెక్కువ స్థితిలోనుండియు నిజానిజములను, వస్తుతత్వములను వాటివలన గలుగు దోషాదోషములను అర్థానర్థములను చక్కగా గుర్తెరుగనేరక యింద్రియలోలుడై యీ దురాగహానమైన వ్యభిచారము స్త్రీవల్లనే గలుగునని భావించుకొనును. చేతకానివానికి శౌర్యము గలిగిన యెంత్రపయోజనమో స్త్రీ

వల్ల వ్యభిచారముగలుగునని నిర్ధారణచేయుట అంత ప్రయో జనకారియై యున్నది.

నాలుగవది భక్తి :—

## భక్తి

ఆకాశమందంతటను తేజస్సు వ్యాపించినటులను, లవ ణము సముద్రపు నీటిలో గలసియున్నటులను వర్షధారలు మే ఘమండలమందున ఘణీభవించియున్నటులను శుద్ధసత్వమైన పరబ్రహ్మమును సమస్తమైనటువంటి అజడ జడపదార్థముల యందును సర్వకాలములయందును అణిమముగాను, మహి మముగాను, గరిమముగాను, లఘిమముగాను, వ్యాపించియు న్నదనియు నెటువంటి అణుమాత్రమైన కర్మచేసినను దానికి చెందునటుల చేయవలయుననియు, త్రికరణశుద్ధి ముఖ్యకర్త వ్యమనియు, దృఢముగా దెలసికొని సృజింప బడినటువంటి సమస్త పదార్థములనుసమముగా ప్రేమించుటయేభక్తి. ఇది నవవిధములుగా భాగింపబడి యున్నది. వాటిలో కొన్నిటిని సూచించెదను :—

తొల్లి విప్రవరుడగు కుచేలుడు తనకు చిరుతప్రాయము నాటి చెలికాడగు శ్రీకృష్ణపరమాత్ముని సందర్శించి సంపద లను బొందెను. ఇచ్చట కుచేలుడు శ్రీకృష్ణ పరమాత్ముని యందు అనన్యభక్తి సల్పినందున భావ్యామునకు చెలికాని

వలె నటించి సకల సంపదల నొసంగెను. పాండవేయులలో నొకడుగానగు పార్థుడు శ్రీకృష్ణ పరమాత్మునియందు దనురాగముగలవాడై జ్ఞానమార్గమును గ్రహించి అన్యభక్తిని సల్పి నిజపదార్థమును సంగ్రహించినందున శ్రీకృష్ణ పరమాత్మను బాహ్యమున బంధుత్వమును వెల్లడిపరచి, రణమందున జయము గలిగించెను. దీని అంతరార్థముయొక్క వివరమును చక్కగా శ్రీభగవద్గీత చెప్పుచున్నది.

వైకుంఠ ద్వారపాలకులగు జయవిజయులు మునిశ్రేష్ఠులగు సనకసనందనాదులను పరిహాసము చేసినందుకై శాపమును పొంది కృతయుగమున హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులుగాను, త్రేతాయుగమున రావణకుంభకర్ణాదులుగాను ద్వాపరయుగమున శిశుపాల దంతవక్త్రులుగాను జనియించిరి. వీరలు పరమాత్మునికి అంతరంగభక్తులైనప్పటికి, కర్మ శేషించినందున కొంతకాలము పరమాత్ముని సాన్నిధ్యమును బాయవలసియుండి మూడు యుగములయందును బాహ్యమున శత్రుత్వమును గనబఱచి సూర్యకిరణములు అస్తమించునపుడు సూర్యునిలో గలసినటులను, నది ప్రవాహము యెంత కల్మషము గలదిగానున్నను తుదకు సాగరసంగమమైనటులను, కర్పూరమునకు అగ్ని స్పర్శ గలిగినంత దాని రూపమును పోగొట్టుకొనునటులను వీరలు యెంత శత్రుత్వమును బాహ్యమున గనపరచినప్పటికిన్ని అంతరంగమున భక్తులైనందున అంత్యకాలము

నందు వీరలు ముగ్గురు యథా ప్రకారముగా పరమాత్ముని సాన్నిధ్యమును జేరిరి.

మున్ను గోపికలు శ్రీకృష్ణపరమాత్ముని తమ మనో వల్లభునిగా ప్రేమించి, మిక్కిలి అనురాగముంచి, భక్తి నిదీపించి సర్వకాలసర్వావస్థలయందున ఆదివ్యమంగళాకరునియందు ధ్యానముంచి, అతనితో రతిసుఖములనుభవించి, తరించిరని వినియున్నాము. తత్వము విచారించినయెడల ధశరధుని ఆత్మ జుడగు శ్రీరాములవారు దండకారణ్యములో సంచరించుచున్నాయుండున, అచ్చటనివశించియున్న మునీశ్వరులు అతని దివ్యమంగళస్వరూపమును జూచి మోహించినందున, వారల గోర్కెలను సఫలతనొందించుటకై వారలను ద్వాపరయుగమందున స్త్రీరూపధారులుగా జేసి, కోర్కెలనుతీర్చుకొనునట్టుల వరమనుగ్రహించెను. యిందుకు కారణము. దండకారణ్యవాసులైన మునీశ్వరులకు సంకల్పముగలిగెను. దానితో గోరికబుట్టెను. ఆకోరిక సఫలతనొందించుకొనుటకై పునర్జన్మమెత్తిన గాన స్త్రీరూపములనుధరించిరి. మరియు సకలచరాచరములు తనరూపుగానుండిన సృష్టి, స్థితి లయములకు కారణభూతుడుగా నుండి, రూపు నామ క్రియారహితుడై సత్వరజస్తమోగుణముల కతీతుడై, అండమై పిండమై, బ్రహ్మాండమై, అణిమమై, మహిమమై, లఘిమమై, గరిమమై, అంతర్బహిః ప్రకాశియై, సంకల్ప వికల్పరహితుడై, నిర్లిప్తుడై, ఆదిమధ్యాంత

హితుడై, అప్రమేయుడై, అవాఙ్మానసగోచరుడై, అఖండ సచ్చిదానందస్వరూపుడై, అనవద్యుడై, కాలాతీతుడై, స్వప్రకాశియై, సర్వసాక్షియై, సర్వవ్యాపియై యున్న భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మ గోపవనితలయొక్క మనోరథములను పూర్తిగావింప నిచ్ఛగలవాడై గోపవనితల పతులు సర్వకాల సర్వావస్థలయందున, యెవ్విధమైన కర్మ జేసినప్పటికిన్ని తననతెనే చూచునటులను, గోపవనితలయొక్క ధవులయందు తన స్వరూపమును కనబడునటులను జేసి, వారలునున్ను అనన్య భక్తిచేత తనయందు వారలను బద్ధానురాగులగునటుల జేసినందున గోపవనితలు తమధవులతో యెవ్విధమైనసంతోషమునుగాని దుఃఖమునుగాని పొందునపుడు శ్రీకృష్ణపరమాత్మునితోనే పొందుచున్నారముగదా యని భ్రమించుచుండిరి. గాని నిక్క మిటులనుండును. తామరాకులమీద జలబిందువులవలె నంటునదగులేయున్నందునను, సౌలభ్యాది కళ్యాణ గుణములు గలిగియున్నందునను, సవిమళకవ్యాపారములందలి ధర్మములచేత హృషీకేశుడయియున్నందునను సంతతము తన్నారాధించు గోపికలను రమింపజేసి పరిపూర్ణబ్రహ్మానుభవమును ప్రసాదించినాడుగాని నతనికి నింద్రియధర్మములంతమాత్రము స్పృశింపనేరవు గోడపైని చిత్రములను వ్రాసి కొంతకాలము జరిగినపిమ్మట వర్షముగురిసినంతలో చిత్రములుపోయి గోడమాత్రమే వుండునటులను, పారిజాతపుష్పములు

భూమిపైనిపడినంతలో భూమికి కొంచెము వాసన కొంతకాల మువరకు గలిగి, అటుపైని భూమికి వాసనపోవునటులను, యీగోపికరూపధారులైన మునీశ్వరులయొక్క సంకల్పములు పూర్తిఅయినతోడనే యధాప్రకారముగా మునీశ్వరులై బర గిరి. మరియు అఖిలరూపధారియైయున్న శ్రీకృష్ణపరమాత్ము డు గోపవనితలయొక్క మనోవల్లభులరూపములవలె గనబడు ట వకగొప్పకార్యమా? సమస్తనదులుచేరి తుదకు సాగరము నుజేరినటులను, చంద్రుని కిరణములు చంద్రునియందే లయిం చునటులను, ఘంటయందుగలుగు నాదము ఘంటయందునే లయించునటులను, సర్వభూతములకు సాక్షిగానున్న పరమా త్మలో యీజీవాత్మలు లయించును. అప్పుడు జీవాత్మపరమా త్మ యను భేదమెటులగానవచ్చును. అది యెట్లనిన ఘటము నందున్న ఆకాశము ఘటమువిరిగినంతలో మహదాకాశము నందు గలయునటుల మాయచేత కృష్ణుని పరమాత్మునిగా నె రుగక, తమ మనోపల్లభుడని భ్రమించి, కొంతకాలము రా హుకేతువులచేత పట్టుబడిన చంద్రునివలె మినాకరించి, మా యయను సంకల్పము రహితమైన తోడనే నిజస్వరూపముల ను దాల్చిరి. మరికొందరు భగవంతుని సగుణారాధనముచేత భక్తిసల్పి, వారల యిష్టార్థములను పూర్తిగానిందుకొందురు. ఎటులననగా దేవాలయమునకు వెళ్లి స్వామివారికి కొబ్బరికా యలుకొట్టి, హారతివెలిగించి, అతి ప్రీతితో భగవంతుని దివ్య

మంగళరూపమును ధ్యానింతురు. యిచ్చట తత్వమువిచారించినయెడల దేవాలయమునకు అయిదుగడపలుగలవు. అవి దాటినపిమ్మట స్వామివారి దివ్యమంగళవిగ్రహము కనబడును గాన పెద్దలు యిట్లువక్కాణించిరి. "దేహో దేవాలయఃప్రోక్తో జీవో దేవస్సనాతనః। త్యజేదజ్ఞాననిర్మాల్యం। సోహం భావేన పూజయేత్" గనుక యీఅయిదుగడపలున్నూ దేహమందున అయిదుతత్వములు. యీఅయిదుతత్వములకు అతీతమైన పరతత్వమే పరమాత్ముడుగాన మనశరీరమునకును దేవాలయమునకును వ్యత్యాసములేనపడదు. అటువంటి దివ్యమంగళాకరుడగు స్వామిముందు కొబ్బరికాయనుగొట్టి కర్పూరమును వెలిగించుదురు. అనగా అజ్ఞానదశలోవున్న జీవాత్మయనెడు కొబ్బరికాయను, జ్ఞానమనెడు కర్పూరప్రకాశము కాగానే దానిని చెక్కలుగాచేసినందున దానిలోవున్న జీవాత్మ శుద్ధశూన్యముగా నున్నమహదాకాశమనెడు పరమాత్మలో లీనమగును. అప్పుడుజ్ఞానమనెడు కర్పూరము వెలిగి శుద్ధశూన్యమనెడు మహదాకాశముతో గలసి, తనరూపును మాపుకొనును. అనగా జ్ఞానోదయము కాగానే జీవాత్మ పరమాత్మ రెండును కలసిపోవును. యీహేతువునుబట్టియే స్వామివారిముందు బాహ్యభక్తిచేత నారికేళములనుగొట్టి కర్పూరమును వెలిగించుదురు. మరికొందరు గోపురములను, సత్రములను, కట్టించుటయందు

ను, చెరువులు బావులు త్రవ్వించుటయందును భక్తిగలిగి సదా వారిజీవితకాలములను గడపుచుందురు. మరికొందరు తీర్థయాత్రలుచేసి, అక్కడక్కడనున్న పుణ్యపురుషులను సేవింపుచు, వారలతో పరమార్థకసంబంధమైన గోప్యములను ప్రశంసింపుచు సందేహములను నివర్తిచేసుకొనుచు కాలము గడపుచుందురు.

మరికొందరు భగవంతునిపాడుచు నృత్యముసలుపుచు గుణములనువర్ణించుచు దేహమందున స్పృహాసహితమునుంచక, ఆనందలహరిలో నోలలాడుచుందురు. మరికొందరు దేవతలయందు ప్రీతిగలవారలై కొన్నిజీవరాసులను బలిగాసమర్పించి వారల యిష్టార్థములను పూర్తిగావించుకొందురు. అయితే, యిట్టిరీతిగా భక్తిసల్పువారలు జ్ఞానమునుసంపాదించనేరరు. గాని ఫలాపేక్షగలవారలై యుందురు. వారలు పూజించు దేవతకు యెంతశక్తియున్నదో అంతమాత్రమే వారలకు ఫలముజెంది పున్నతజన్మముగలిగి అది పూర్తిఅయినవెంటనే యథాప్రకారముగా తిరిగి జన్మమునకు వచ్చెదరు. లేక యింకా తక్కువజన్మమునకు కూడా రాగలరు. మరికొందరు గృహస్థధర్మములోనుండి, అతిథుల నభ్యాగతులను పరబ్రహ్మస్వరూపులనుగా భావించి, జీవకారుణ్యమనెడు వచనమును పాటించి సదా భగవత్ప్రీతిగా వారలనుపూజించి, వారలకోర్కెలను సఫలతనొందించుటయందు భక్తిగలవారలై యున్నారు.

మరికొందరు ఏకాదశి, ద్వాదశి, మొదలుగాగల వ్రతములను పాటించి భోజనమునుమానివేసి, వుపవాసవ్రతము ననుష్ఠించి, భక్తితో భగవంతుని ధ్యానించుచున్నారు. యిచ్చట వుపవాసమనగా, దశేంద్రియములను వాటియొక్క వ్యాపారములనుంచి తొలగించి, వాటిబలము నణచి, ఏకాదశేంద్రియమగు మనస్సును వక్కచోట బంధించి, సుషుమ్న అను వాయువుయొక్క సంచారమును గుర్తెరిగి, మనస్సును బుద్ధితో యేకీభవింపజేసి, శుద్ధసత్వమునకు మార్చి, సుషుమ్నకు సమీపముగా వశించునటులజేసి, పరబ్రహ్మమునుగురించి ధ్యానించుట యని అర్థము. మరికొందరు నిత్యనైమిత్తికకర్మములను క్రమముగానాచరించుచు, స్వధర్మమునకు యేవిధమైనలోపమును రాకుండా కాపాడుకొనుచు భగవంతుని నారాధించుచుందురు:—

మరికొందరు యాగములను, యజ్ఞములను, ధానములను మంత్రవుపాసనలను, మొదలుగాగలవాటిని శ్రద్ధతో నాచరించి భక్తిగల్గియుందురు. యిచ్చట వారు భక్తిసల్పినటువంటి అధిదేవతలకు యెంతశక్తియున్నదో అంతవరకు వీరల జన్మములను ప్రకాశింపజేసి, వారలశక్తి పూర్తిఅయినతోడనే యథాప్రకారముగా వీరలకు యెప్పటిజన్మమునే లభింపజేయును. ఏలననగా శుద్ధసత్వమైన పరబ్రహ్మమునకే స్వకీయ

త్వముగలదుగాని, యితర దేవతలకు లేదు. యిందుకు వుదాహరణ చెప్పెద :—

ఒకమనిషి నేరము చేసినయెడల, పోలీసువారు పట్టుకొందురు. ఆ నేరస్తుడు పునర్విచారణ కోరినయెడల, తిరిగి అంతకంటె గొప్పఅధికారియెదుట ఆ నేరస్తుని నిలిపి, విచారణ చేయుదురు. అప్పటికైనా న్యాయము జరుగనియెడల క్రమప్రకారముగా గొప్పఅధికారులతీర్పులను యావత్తు జరిగించి, తుదకు చక్రవర్తివద్దకు ఆనేరస్తుని గొనిపోవుదురు. అప్పుడుగదా ఆనేరస్తునికి దండనగాని, విడుదలగాని విధింపబడును. అనగా చిన్నఅధికారులు గొప్పఅధికారులు వారలకు గలిగినంత శక్తికొలది న్యాయమును తీర్చిరిగాని, అదిసరిగా లేనందున, రద్దుచేసి తుదకు చక్రవర్తి శిక్షను విధించును. అటువలెనే దేవతలకు శక్తికొద్దిగా వుండును గాని గొప్పగా వుండక పోవుటచేత తిరిగిజన్మమునకు రావలసియుండును. జిహ్వాచాపల్యముచేత పీడింపబడి గ్రామ్యములైన కామ్యములందపేక్ష గలిగి అల్పదేవతలకు జీవరాసులను బలియిచ్చి త్రికరణశుద్ధి యెంతమాత్రములేక చేసిన భక్తిమాత్రము నిష్ప్రయోజనమగును. శుద్ధసత్వమైన పరమాత్ముడు సమస్తప్రాణులయందున సమవర్తియై యున్నాడని దృఢభావన గలిగి త్రికరణశుద్ధిగా భక్తిచేసినయెడల అదిసార్థకమగును.

మరియు రాజభక్తి, గురుభక్తి, మాతృభక్తి, పితృభక్తి, దైవభక్తి, దేశభక్తి, భ్రాతృభక్తి, పతిభక్తియనికూడాగలవు :—

రాజభక్తి :—అనగా తనరాజుయందున అన్నివిధములచేత భక్తికలిగియుండుట అనగా నయమునగాని, భయమునగాని, భక్తినిగాని తనరాజును అన్నివేళలయందున భగవంతుని ప్రేమించురీతిగా ప్రేమించుటయే రాజభక్తి :—

గురుభక్తి :—అనగా గురువును సర్వవిధములచేతను సర్వకాలముల యందును భగవంతునివలె ప్రేమించుటయే గురుభక్తి :—

మాతృభక్తి.—అనగా తల్లిని మొదటి దైవముగా నెంచి అన్నివిధములచేత ఆమెను సంతోషింపజేసి సర్వకాల సర్వావస్థలయందును ఆమెచేత దీవనలను బడసి ఆమెను ప్రేమించుటయే మాతృభక్తి :—

పితృభక్తి :—అనగా తండ్రిని రెండవ దైవముగానెంచి ప్రతికార్యమందున అతనికి సంతోషమును కలిగింపుచు అతనిచేత ఆశీర్వచనములను బడసి తండ్రిని ప్రేమించుటయే పితృభక్తి :—

దైవభక్తి :—అనగా దైవముచేత సృజింపబడినటువంటి జడ అజడ పదార్థములందంతటను పరబ్రహ్మముగు దైవము యేకరీతిగా నిండియున్నాడని తలచి, సమస్త భూతములను

పరబ్రహ్మ స్వరూపములుగా నెంచి, ప్రేమించుటయే దైవ భక్తి:—

దేశభక్తి:—తన స్వదేశముయొక్క అభివృద్ధినిగలుగ జేసెడు పనులను సంగ్రహించుటయందు ఆసక్తి గలిగి, సదా తనజీవితమును దానిక్రిందనే వినియోగపరచుచు తనదేశమును ప్రజలను వున్నతదశకు తెచ్చుటయందు వశానుకప్పుడు తన ప్రాణమునకు హాని సంభవించినప్పటికైనను, వెనుక దీయక అతిసంతోషముతో కార్యములు జరుపుచు దేశమును ప్రజలను ప్రేమించుటయే దేశభక్తి:—

భ్రాతృభక్తి:—అనగా అన్నగారిని తండ్రితో సమానునిగా నెంచి, తండ్రికి చేసిన మర్యాదలన్నిటిని సమముగా అన్నగారికిచేసి అన్నగారి మనస్సు యెల్లప్పుడు సంతోషింప జేయుచు, వారిచేత దీవనలుబొంది అన్నగారిని ప్రేమించుటయే భ్రాతృభక్తి;—

పతిభక్తి:—అనగా పతిని దైవము[illegible] భావించి సమస్తమైనటువంటి వుపచారములచేత పతిని[illegible]వ పెట్టుచు పతికంటె దైవము వేరులేదనియు పతిసేవకంటె దానములు, జపములు, హోమములు, గంగాయాత్రలు నోములు మొదలగు సమస్తమైనటువంటి కర్మములు తక్కువగానెంచి పతిసేవయందున ప్రీతిగలిగి యుండుటయే పతిభక్తి:—

సమస్తమైన నదులకు వుదకము ప్రధానమగునటులను పుష్పములకు వాసన ప్రధానమగునటులను, చీటికి వ్రాలు ప్రధానమగునటులను, భోటికి మానము ప్రధానమగు నటులను, మాటకు సత్యము ప్రధానమగునటులను, గృహామునకు పునాది ప్రధానమగునటులను కులముద్ధరించుటకు బుద్ధిమంతుడైన కొడుకు ప్రధానమగునటులను, పూర్ణచంద్రికను ఆనందించుటకు పూర్ణచంద్రుడు ప్రధానమగునటులను, వెలుతురును ఆనందించుటకు ప్రకాశము ప్రధానమగునటులను, ప్రకాశమును ఆనందించుటకు వేడిమి ప్రధానమగునటులను, వేడిమి గలుగుటకు అగ్ని ప్రధానమగునటులను, అగ్నిగలుగుటకు వాయువు ప్రధానమగునటులను, వాయువుగలుగుటకు ఆకాశము ప్రధానమగునటులను, యిటువంటి మహదాకాశరూపముగానున్న శుద్ధసత్వ పరబ్రహ్మమును గుర్తెరుగుటకు నిష్కామమైన అనన్యభక్తియే ప్రధానము,

మరి[illegible]ందు నేను వుదహరించినటువంటి వివిధమైన భక్తులలో [illegible]మన భక్తిగాని చేయవలెనంటె, ముఖ్యముగా తాను చేయు కర్మములయొక్క ఫలములను గోరక, వాటిని భగవత్ప్రీతిగా సమర్పించి, తన స్వధర్మస్వామతాచారానుకూలముగ ప్రవర్తించిన యెడల తప్పక జ్ఞానమును సంగ్రహించగలడు,

# తత్వజ్ఞానవిచారణము.

అయిదవది:—తత్వజ్ఞానవిచారణము.

చక్కెరన్న మాత్రమున మాధుర్యము తెలియనటులను, అన్నమన్న మాత్రమున ఆకలితీరనటులను, సౌందర్యస్త్రీయన్న మాత్రమున సంభోగశక్తితీరనటులను, గంగయన్న మాత్రమున కల్మషములు క్షయింపనటులను, చంద్రుడన్న మాత్రమున చంద్రికవల్లగలుగు చల్లదనముగలుగనటులను, మంచినీళ్ళు అన్న మాత్రమున దాహముతీరనటులను, ఔషధమన్న మాత్రమున రోగనివారణకానటులను, తత్వమన్న మాత్రమున నహంకారము నశింపనటులను, గురువన్న మాత్రమున గుణములుగలుగనటులను, అటువలెనే జ్ఞానమన్న మాత్రమున ఆనందము గలుగనేరదు. కాబట్టి సుద్ధసత్వమైన జ్ఞానమును సంగ్రహించుటకు ముందు జేయునటువంటి కొన్ని సాధనములను, లక్షణములను వివరించెదను.

బుధులు అంగమనెడు దేవాలయమున, దేహేంద్రియములను పరిచారికలనుగా జేసి, షట్కమలములను పుష్పములుగా జేసి మనస్సు, బుద్ధి, చిత్తమనెడు అంతఃకరణత్రయములను నైవేద్యముగా చేసి, జ్ఞానమనెడు జ్యోతిస్వరూపమును వెలిగించి, సహస్రారమనెడు రత్నసింహాసనముపై ఆసీనుడైయున్న

ఆత్మారాముడనెడు పరబ్రహ్మమునందుగలసి ఆనందింతురు. దీనినే మానసపూజయని జెప్పుదురు.

మరియు చపలస్వభావముగల మనస్సును యింద్రియ ములయొక్క వలలో దగులనీయక నిర్బంధపెట్టుటకై దారణ యోగమును అను సంధింపదలంచి నిర్జనప్రదేశమున శుభ్రమై నచోట గూర్చుండి, మితఆహార, నిద్ర మొదలగు అభ్యాసముల నుజేయుచు, నిర్ణయప్రకారము ఉచ్ఛ్వాసనిశ్వాసములను నిరో ధించుచు, ప్రాణవాయువును, రేచక, పూరక, కుంభకముల చేత క్రమముగా ప్రతిచక్రమునందున్న అధిదేవతకు సంఖ్యప్ర కారముగా శ్వాసనుకుంభించి, ధ్యానించి, అటుపైని చక్ర.... లు దాటినమీదట ఆధారచక్రమునుంచి వెన్నుపూస వెంబడి వ్యాపించియున్న సుషుమ్నఅనెడు సర్వనాడితో దీనినిజేర్చి భ్రూమధ్యమందున దృష్టినిల్పి, అచ్చట పరజ్యోతిస్వరూపము గాను, బయలుగాను, అఖండప్రకాశముగాను వెలుగుచున్న పరమాత్మను దర్శింపుచు, దేహస్మృహామరచి ఆనందించుట యే సమాధియని పిలువబడును. మరియు సమాధిబలముచేత పాపములెల్లతొలగిపోయి సుఖస్థితియు ప్రభావశీలతయు గలి గియుండుటవలన నితరదేహములలో ప్రవేశించినను, సద్ప్రకా రముగానుండును. మరల మనదేహమునకువచ్చును. ఈ ప్రకా రముగా పరకాయప్రవేశముచేయుటకు లింగదేహమున కొ క్కటికే శక్తిగలదుగాని యితరులకులేవు. గాన ధ్యాన,

ధారణ, సమాధులనెడు మూడును యోగమునకు స్వరూప ములు. యోగమనగా నానావిధములయిన విషయముల రూప ముగా ప్రతినిమిషమందును మారుచున్న చిత్తవృత్తిని నిరో ధించుటయే యోగమనబడును. దీనిచేత దూరదృష్టి, ఆకాశ గమనము, దూరశ్రవణము, అదృశ్యకరణము మొదలుగాగల అణిమాదిసిద్ధులు లభించును.

అనాదిగానున్న శుద్ధసత్వమగు పరబ్రహ్మమునందు త్రిగుణాత్మకమైన మాయ పుద్భవించెను. దానిచేత పంచభూత ముల అంతఃకరణత్రయములుచే నిర్మాణమైన ప్రపంచము కల్పిం పబడెను. దానిలోజీవులు వాటివాటియొక్క కర్మానుగుణ్యము గా సృజింపబడెను. అటుపైని యింద్రియములు విషయముల యొక్క బహిస్సుఖమునుజూచి, వాటియందు ప్రవేశించి వ్యా పారములను చక్కగా జరిపించుచు మనస్సునివాటికి మిత్రు నిగా జేసుకొని బుద్ధియనెడు గురువుచెప్పెడు మార్గమును గమ నింపక అకార్యకార్యములను ఆచరించుచు, వాటిఫలముల ననుభవించుచు, రాగద్వేషకామక్రోధములనెడు పుత్రులయె డల ప్రేమజూపుచు దినదినము కర్మసంచయమనెడు సంసార మును వృద్ధిపొందించుకొందురు. వృక్షములకు ఛాయవలెను, సముద్రమునకు తరంగములవలెను, స్త్రీకి ఆభరణములవలె ను, శుద్ధసత్వమైన పరబ్రహ్మమునకు మాయ అటువలెనే దోచుచుండును.

అనగా చలనశీలమయిన్న మాయ అశాశ్వతమనియు, దానివల్లగలుగు చిత్రవిచిత్రములైన వివిధరూపములు చలనశీలములనియు, శుద్ధసత్వమైన పరబ్రహ్మమే శాశ్వతమనియు చక్కగా గురుముఖమున గ్రహించి, యింద్రియవృత్తులను తలచూపకుండా జేసి, మనస్సును బుద్ధిని యేకీభవించి, అవిద్య యనెడు చీకటిని జ్ఞానమనెడు దీపముచేత తొలగించి, సర్వమందున పరబ్రహ్మమేనిండియున్నదని భావించి, సర్వభూతములయందును దయగలిగి, యెవ్విధమైన కర్మ జేసినప్పటికైనను కుమ్మరిపురుగు బురదనంటనటులను, నాలుకకు జిడ్డునంటనటులను, కర్మములను తనకంటకుండా భగవత్ప్రీతిగా జేసుకొనుచూనుండుటయే సహజానంద సమాధియని పెద్దలు వక్కాణింతురు. యీ సమాధిసలుపువారలు వకానొకప్పుడు దేహబుద్ధినికూడా మరచియుందురు. యిటువంటి వారలనే బ్రహ్మవేత్తలనియు, జ్ఞానులనియు సదా పూజించెదరు.

కొందరు భగవంతుడే సంకల్పవికల్పములకు కారణభూతుడని వాదింతురు. తత్వము చక్కగా ఆలోచించిన యెడల యిది మిథ్యారూపమయిన అవిద్యవల్ల గలిగినదని యెంచనగును. దీనికి హేతువు.—

అజ్ఞానదశలోవున్న జీవుడు అవస్థాత్రయములలో నొకటిగానగు స్వప్నావస్థలోనున్నప్పుడు వివిధములైన చిత్రవిచిత్రములగు వస్తువులను, అపూర్వమైన వస్తువులను, వాటికనుగు

ణ్యమాగునటుల కర్మములను చేయుచున్నటులను, అకర్మము లను భవించుటలో ఖేదమోదములనొందుచు కొన్ని సమయములం దున యేడ్చుచు, యిటువంటి మొదలుగాగల అవస్థలను పొం దుచుండును. ఇది అంతరా స్వప్నావస్థ యెంతవరకువుండునో అంతవరకు జరుగుచునేయుండును.

స్వప్నమునకు కల్లయని యెందుకువాడుకొందురనగా మనుజునికి విధించిన ఆయువు 100 సంవత్సరములు. దానిలో సగము నిద్రావస్థలో నేపోవును. అటువంటి నిద్రావస్థలో యిటువంటి స్వప్నావస్థ యెంతప్రమాణమైయుండును.

అనగా మనుజుని జీవితములో చాలా స్వల్పప్రమాణ ముగలదిగా నుండునుగాన కలకల్లయని వాడుకొందురు.

యిటువంటి అజ్ఞానదిశలోవున్న జీవుడు తిరిగి జాగ్రత్త వస్థలోనికి రావేగమే నేను స్వప్నమును గన్నానుయని చెప్ప నారంభించును. అనగా తాను వేరుగాను నిద్రలోగన్న స్వ ప్నము వేరుగాను భావించి చెప్పును. యిచ్చట యీజీవునికి నిద్రావస్థయను మాయాశక్తి తనలోయిమిడియుండియు తాను వేరుగాను నిద్రలో స్వప్నము ననుభవించునాడు వేరుగాను భావించును. యిటువంటి కించిజ్ఞుడగు జీవుడే యిట్టి నిద్రాశ క్తినిగలిగి అపూర్వమైన చిత్రవిచిత్రములైన వస్తువులను సృష్టించుచు, వాటివల్ల గలుగు సుఖదుఃఖములను అనుభవిం చుచు తానువేరుగాను నిద్రాశక్తి వేరుగాను భావించినంతలో

సర్వజ్ఞుడగు శుద్ధసత్వ పరబ్రహ్మము యొక్క మాయ అనెడు శక్తిని వర్ణింప నెవరితరము? యీపాంచభౌతికమైన త్రిగుణాత్మకమైన సర్వప్రపంచము మాయయొక్క కల్పనగాని శుద్ధసత్వమగు పరబ్రహ్మమునకు దీనిలో యేవిధమైన సంబంధము లేదు. యిటువంటి మాయచేత కల్పింపబడిన సృష్టికి కల్పము వచ్చినప్పుడు సహితము యథావిధిగా శుద్ధసత్వమగు పరబ్రహ్మమునందు యేకీభవించును.

ఇది యెటులననగా సూర్యునియొక్క కిరణములలో వివిధ వర్ణములను చూచుచుందుము. సూర్యుడు మరిగినంతలో ఆకిరణములు సహితము మరిగిపోవును. అనగా ఆకిరణములు సూర్యునిలో యేకీభవించును. అటువలెనే వివిధ చిత్ర విచిత్రములను ప్రదర్శింపు ప్రపంచమునకు సంకల్పము గలిగినంతలో మాయయను కిరణములు సూర్యుడను శుద్ధసత్వ పరబ్రహ్మమునందు గలయును. ఇచ్చట శుద్ధసత్వ పరబ్రహ్మము స్వయం ప్రకాశమైనది. సూర్యుడు పరప్రకాశుడు. మాయచేత కల్పింపబడిన ప్రతి కర్మమునకును, దానికనుగుణ్యముగా లభించు ఫలములకున్ను శుద్ధసత్వ స్వరూపుడగు పరబ్రహ్మమునకున్ను యేలాగున సంబంధము కలుగును.

మరియు సూర్యుడుదయించు నపుడు జీవులను నిద్రాశక్తినుంచి లేపి వారివారలయొక్క ప్రకృతి సంబంధమైన కృత్యములను నెరవేర్చుకొమని నియమించు చున్నాడా? తాను

అస్తాద్రికి పోవునపుడు యీజీవులను నిద్రపొందని బోధించు చున్నాడా? యీ రెండు విధములైన నియమము, బోధన కూడా జీవులకు స్వాభావిక గుణములుగానే కనబడుచున్నవి, గాని సూర్యునియొక్క ప్రేరేపణచేత జరుగుచున్నటుల లేశ మైనను గనపడదు. అదేవిధముగ మాయాభ్రాంతులైన జీవులు యింద్రియములయొక్క వలలోజిక్కి పెక్కుకర్మములను జే యుచుందురు. గాని శుద్ధసత్వ స్వరూపుడగు పరబ్రహ్మము యెప్పటికిన్ని సంబంధమును గలుగజేసుకొనడు.

ఎండమావులనుజూచి మృగము తృష్ణతీర్చుకొనవలెనని యెంచి పరుగెత్తి తుదకు జలమునుగానక విసుగుకొని ఆయా సమును జెందునటులను, పతంగములు దీపముయొక్క ప్రకా శమును జూచి భ్రమించి దానిని సమీపించి ప్రాణములను గోల్పోవునటులను, యీజీవుడు చలనశీలములయిన యింద్రి యములయొక్క సుఖములను జూచి మనస్సును స్వాధీనము చేసుకొనజాలక తనయొక్క నిజరూపమును గుర్తెరుగ జాలక పెక్కు చిక్కులు పడుచు జనన మరణావస్థలను పొందుచుం డును.

మరియు విష్ణువని, బ్రహ్మయని, సదాశివుడని, మహే శ్వరుడని రుద్రుడని నామములు పరబ్రహ్మమునకే గలిగెను. యెట్లనిన ప్రపంచోత్పత్తికి కారణభూతమయిన మాయ పర బ్రహ్మమునందు వక యణుమాత్రమని చెప్పుదురు. మాయ

యను ఛాయయందున ననంతమగు నాకాశమును ఆకాశము
నందు వాయువును, వాయువునందు తేజస్సును, తేజస్సునందు
జలమును, జలమునందు పృథివియు నణగియుండును. నిరా
కారమగు పరబ్రహ్మమునందు దోచినమాయ పంచభూతము
లలోనుండి వానిని బరస్పర మేకీభవింప జేయును. ఆప్రకార
ముగా నేకీభవించినవెల్లను ఈశ్వర ప్రేరేపణచేత ననేక కోటి
బ్రహ్మాండములై వివిధ చిత్ర రూపములతో గానవచ్చును.
స్ఫటిక మత్యంత స్వచ్ఛముగానున్నను పంచవర్ణ సాన్నిధ్యము
తటస్థించినప్పుడు బహువిధవర్ణములుగా దోచునట్లు పంచభూ
తములయందు ప్రతిఫలించిన పరబ్రహ్మము పంచభూత సంబం
ధగుణముల ననుసరించి సదాశివుడనియు, మహేశ్వరుడనియు,
రుద్రుడనియు, విష్ణువనియు, బ్రహ్మయనియు వ్యవహరింపబ
డును. వీటిలో బ్రహ్మ శబ్ద, స్పర్శ, రూప రస గంధములను
నయిదు గుణములుగల పృథివివలన స్థావరజంగమ రూపమ
యిన ప్రపంచమునంతను సృజించును. విష్ణు శబ్ద, స్పర్శ రూప
రసములను నాలుగు గుణములుగల జలమువలన సకల ప్రపం
చమును రక్షించును. రుద్రుడు శబ్ద, స్పర్శరూపములను మూ
డుగుణములుగల తేజమువలన సకల ప్రపంచమును సంహరిం
చును. మహేశ్వరుడు శబ్ద, స్పర్శములను రెండు గుణములు
గల వాయువు వలన మాయా సంబంధమైన జీవ కోటి
కంతకు భ్రమ గల్పించును. సదాశివుడు శబ్దమును నొక్క

గుణముగల యాకాశమువలన జీవవర్గమునకు దెలివిని గలిగించును. మాయ పంచభూతవికారమైన దేహేంద్రియాది ప్రపంచమును తానని యభిమానమును బుట్టించును. బ్రహ్మము దేహాది ప్రపంచమునకును అహంకారయుక్తుడగు చిదాభాసునకును విలక్షణమై సర్వసాక్షియై దృక్స్వరూపమయి యాత్మమాత్రముగా నుండును.

జీవులకు సంసారమను కీకారణ్యము మిక్కిలి భయంకరమైనది. అది ఇండ్లు, వాకిళ్లు, తోటలు, దొడ్లు, బంధుమిత్రులు, పుత్రకళత్రములను పుండ్ల చెట్లతోను పొదరిండ్లతోను గూడుకొనియుండును. అందు కామక్రోధలోభమోహమదమత్సరములను దొంగలును, రోగములను వ్యాఘ్రములును, పాములను, ఘోరరాక్షసులును, మూడవిధముల పిశాచమును, మృత్యువను సింహమును విచ్చలవిడిగా తిరుగుచుండును. దారిద్ర్యమను మహాలోతైన గుంటలును కోలపెట్టెసట్టుచుట్టును జుట్టుకొనియుండును. రోషసంతోషములను ఈదరగాలి భయంకరముగా వీచుచుండును. దుఃఖమను కార్చిచ్చు మహావేగముగా దహించుచుండును. స్వర్గనరకములను తప్పుత్రోవలు ముక్తిపథమును తప్పించి, విషమకత్రిప్పలు పెట్టుచుండును. ఘోరారణ్యప్రదేశమున పురుషుడు నిరంతరము పుణ్యపాపములకు లోబడి, తిరిగి తిరిగి విశ్రాంతిజెందుటకు నొక్కడును యుక్తమైనస్థలముగానక వేసరిపోయి, ముందుచూచి యొక యెన్ని

జన్మములెత్తవలయునోయని తత్తరపాటుజెంది శోకభయవ్యాకులితచిత్తుడై తాపత్రయమను మిడిమిడియెండచేత మలమల మాడి యత్యంత ప్రయాసముమీద యాగములను వృక్షచ్ఛాయల నాశ్రయించి, ధనధాన్యములు, గృహారామములు, చందనకుసుమములు, పశుభృత్యకళత్రక్షేత్రములు మొదలగు విషయములను సంపాదించుటకు ముఖ్యసాధనములైన కృషివాణిజ్య యాచనాసేవకా వృత్తులు మొదలగు లౌకికకర్మముల నెల్ల మానుకొని స్వర్గము మొదలు సత్యలోకమువరకుగల పరలోకమం దనుభవింపగలిగిన సుఖములకు ప్రధానసాధనములయిన నిత్యనైమిత్తికాది కర్మములను నిరంతరము ఫలాపేక్షలేక భగవత్ప్రీతిగా జేయుచు భగవదనుగ్రహమువలన బరిశుద్ధచిత్తత నొంది, భూమి, జలము, అగ్ని, వాయు, ఆకాశము, చంద్రసూర్యులు, కపోతము, అజగరము, సముద్రము, మిడత, తేనెటీగ, తుమ్మెద, యేనుగు, జింక, చేప, వేశ్య, కురరపక్షి. శిశువు, కన్య, శరకర్త, పాము, సాలెపురుగు, కణుదురు వీని గుణములను చక్కగా గ్రహించి యాప్రకారముగా మెలగుచున్న పక్షమున ప్రత్యగాత్మ బ్రహ్మైక్యసాక్షాత్కార విచారమున కధికారియై వేగముగానే కడతేరగలడు.

భూమి సమస్తప్రాణుల కాశ్రయమయి వానికార్యముల నెల్లను సహించుకొనియున్నలాగున ముముక్షువెప్పుడు క్షమతో గూడియుండవలసినది.

మూలచ్ఛేదనము జేసినను, కొమ్మలు నరికివేసినను, చెక్కలు చెక్కివేసినను, వృక్షములు పరులకు వినియోగించు నట్టుగా పరులనిమిత్తమై తనకాపదవచ్చినను నిశ్చలచిత్తతతో వెనుక దీయకుండవలయును. జలము పారిశుద్ధ్యమాధుర్యాది గుణములచేత స్నానపానములకు బాత్రమయియున్నట్టు ముముక్షువెప్పుడు సత్ప్రవర్తనముచేత నెల్లప్పుడును శుచిర్భూతుడయియుండవలయును. అగ్నిహోత్రమెప్పుడు అంధకారముతో జేరక ప్రకాశించునట్టు ముముక్షువెప్పుడును నజ్ఞానముచే గప్పబడక సుజ్ఞానదీప్తుడయి వుండవలయును.

సమిధలు మొదలగు వాని సంయోగముచేత నగ్ని వెలుగునట్టుగా ముముక్షువు శుద్ధతపస్సుచేత వెలుగవలసినది. వాదనాదమొదలగు విధులచేత అగ్ని తిరస్కరింపబడనట్టు ముముక్షువు పరులవలన సంక్షోభమును జెందగూడదు.

అగ్నిహోత్రము తనకు అప్రయత్నముగా లభించిన వస్తువులయెడల రుచిపక్వముల నెంచకుండా యేటుల భక్షణమే భక్షించునో అటువలె ముముక్షువు తనకు లభించిన పదార్థములయందు రుచిపక్వములను నెంచకుండా స్వీకరించవలెను.

ఆకాశము చరాచరరూపమయిన సమస్తపదార్థములయందును అంతటను నిండియున్నదయ్యును దేనియందును దగులక విలక్షణమైయున్నట్టు పరమాత్మ సకలవస్తువులయొక్క బహిరంతరముల నెక్కడను నిండికొనియున్నదయ్యును వాని

కన్నిటికిని విలక్షణమైయున్నదనియు, నాకాశము తనయందు దోచెడు మేఘము, మెరుపులు, మొదలగువానిని వేటిని తాక నట్టే పరమాత్మయు గాలవశమున దనయందుదోచు నుత్పత్తిస్థితి నాశములనుబొందక సచ్చిదానందముగా విలసిల్లునని తెలుపవలెను. గాని తాను వేరుగాను తలంచి విగ్రహముల యందును దేవస్థలములయందును పరమాత్ముడున్నాడనియు నితరస్థలములయందున వస్తువులయందున లేడని భావించుట యెటులవున్నదనగా బెస్తవాడు చంద్రకళరాత్రులయందు గొప్పవలను సముద్రములోవైచి యీవలకు లాగినప్పుడు చంద్రుడు ఆవలలోచిక్కినాడని తలంచి వలనుచూచినంతలో యథాప్రకారముగా వలను మాత్రమే జూచును గాని చంద్రుని జూడడు. అటువలెనే మాయాభ్రాంతులైన మానవులు శుద్ధసత్వమైన పరబ్రహ్మమును గుర్తెరుగపటుల జ్ఞానమును సంపాదించుటకు త్రోవనుగనలేక తప్పుత్రోవలగు ముండ్లతో నిండియున్న త్రోవలనుజూచి, భ్రమజెంది అత్రోవలే సురక్షితముగాను, చిక్కులులేకుండగాను తాము చేరవలసినటువంటి తావునకు తీసుకొనిపోవునని యత్నించి, ఆమార్గము వెంబడినే బోవసమ్మతించెదరు. కొంతదూరము గడచినతరువాత ముండ్లను కర్మములు గ్రుచ్చుకొనును. దానివల్ల బాధలను జననమరణావస్థలును పొందుచుండును. యిటువంటి జననమరణావస్థలను అనుభవించుటకుగాను స్థూలశరీరమును ధరించుటకై

లెక్కలేని పెక్కుయోనులందున పుట్టుచుండును.

యిందులో ప్రథమముననే భక్తియోగము, కర్మయోగము, జ్ఞానయోగము లనుగురించి కొంతవరకు దేటపరచడమైనది, వాటిలో యేవక్కదానినైనను అభ్యసింపనపేక్షగల వారలు మొట్టమొదట ఆచరించవలసిన కార్యములను క్రమముగా జరిగించుకొనుటకు తగినటువంటి ఆవశ్యకమైన సాధనములను యథావిధిగాను క్లుప్తముగాను వివరించడమైనది.

బంగారమునకు వన్నె పెట్టినటులను, సౌందర్యవనితకు ఆభరణములు పెట్టినటులను, పట్టువస్త్రమును పట్టుదారముతోనే కుట్టునటులను వజ్రమునకు సానబట్టునటులను, దీపమునకు మరియొక దీపముచేత ప్రకాశమును హెచ్చించినటులను పాలయందున పంచదార గలిపినటులను అటువలెనే యీవిషయమును మరియొక పర్యాయము చదువరులకు చక్కగా జ్ఞాపకమునకు తేదలంచి కొన్ని సారాంశములను జేర్చి అతి రమ్యముగ శోభిల్లునటుల జేయడమైనది.

కర్మచేయడములో ఫలాపేక్షగలిగి చేసినయెడల దాని ఫలమును అనుభవించినపిమ్మట తిరిగి ప్రస్తుతజన్మమునకు గాని లేక అంతకంటె తక్కువజన్మమునకుగాని రావడము తటస్థించును.

కర్మఫలాపేక్షలేకుండా చేసినయెడల జ్ఞానముదయించును. జ్ఞానముదయించినందువల్ల నిత్యానిత్యవస్తువివేచనము

కలుగును. అటువంటి వివేచనము కలిగినందువల్ల నిత్యమైనటు వంటి వస్తువును గుర్తెరుగుటకు తగినటువంటి సాధనములను అభ్యాసముచేసి తుదకు అటువంటి నిత్యమైనవస్తువును సంగ్రహించుటకు అవకాశముగలుగును.

మరియు కర్మచేయునప్పుడు యేజాతివారైననుగాని, యేమతమువారైననుగాని తమతమ స్వధర్మముల ననుసరించి కర్మములను ఫలాపేక్ష లేకుండా జేయుచున్నయెడల అటువంటికర్మములు జీవులనంటనేరవు మరియుజ్ఞానము నభివృద్ధి జేయును.

పూర్ణముగా నజ్ఞానములో మునిగియున్నవారికి దృశ్య ప్రపంచమంతయు నిత్యమనితోచుట సహజముగాన మనశ్శుద్ధి కొరకు సత్కర్మముల నాచరించవలయును. యింతకంటెయెక్కువ వివేకముగలవారికి జీవమే తానునియు దృశ్యప్రపంచ మంతయు గాలక్రమమున వేరురూపముగా మారుటవలన నిత్యమనియుదోచుట సహజముగనుక నట్టివారు చిత్తశుద్ధికొరకు భక్తినవలంబించవలెను. శుద్ధజ్ఞానసంపన్నులయి వున్నవారికి స్థిరవిచారణవలన బ్రహ్మమే తానునియు దృశ్యప్రపంచమంతయు విద్యయనితోచుట సహజము, గాన అటువంటివారలు జ్ఞాననిష్ఠ నవలంభించి, ద్వైతభావము తొలగించి, తుర్యదృష్టిగలిగి నిర్మలత నొందియుండవలెను.

మరియు కొందరికి జ్ఞానమార్గము సులభముగాలభ్యము

గును కొందరికి భక్తిమార్గమ్ము సులభముగానుండును. కొంద
రికి కర్మమార్గము సులభముగాకుండును. గాని కర్మములచే
యీకున్న యెడల, భక్తికుదుర నేరదు, భక్తికుదురనియెడల
జ్ఞానముసిద్ధింపదు. జ్ఞానముసిద్ధింపకున్న ముక్తిగలుగనేరదు
ముక్తిజెందువారికి కర్మమార్గము బాల్యమువంటిది భక్తిమా
ర్గము యౌవనమువంటిది జ్ఞానమార్గము వార్థకదశ వంటిది.
కనుకనే కర్మ పిందెవంటిది, భక్తి కాయవంటిది, జ్ఞానము పం
డువంటిదని పెద్దలు వక్కాణింతురు.

శ్రద్ధ అన్నిటికంటెను ముఖ్యమైనది యిదిలేనియెడల
జ్ఞానముగలుగనేరదు. కనుక శ్రద్ధయేఋతువనియు, సుఖదేశమే
వీర్యమనియు, జ్ఞానమే గర్భమనియు, ఆనందమే శిశువనియు,
పెద్దలు పలుకుదురు. ఋతువు కానటువంటి కన్యకు గర్భము
కానట్టు శ్రద్ధలేనివారికి పరమార్థచింత దొరకనేరదు.

భగవంతుని సత్కార్మాచరణమువలన సంతోషింప
జేసిన పిమ్మట భక్తివలన అతని అనుగ్రహమును, బడయవల
యును. అటుపిమ్మట అంతరంగమందున అతిసూక్ష్మముగ
ప్రకాశించుచున్న నతనిని జ్ఞాననేత్రమువలన గనుంగొని సంశ
యములనెల్ల నివర్తిచేసుకొని నిర్గుణోపాసనాపరాయణుడై
అనంతసామ్రాజ్యము ననుభవింపవలయును.

దృశ్యమైనటువంటి దేహాది ప్రపంచములమీద నాశలు
డుగక శుష్కవేదాంతములను కొన్నిటిని సంగ్రహించి జ్ఞాన

యోగమునందు తమకు పూర్ణపాండిత్యము గలదని దురభిమాన గ్రస్తులై, నటించి, కర్మ, భక్తిమార్గములను బొత్తిగా తిరస్కరించి తామె బ్రహ్మమని వర్తించువారలు తుదకు పుట్టికి లేక స్వర్గమునకు లేక క్రిందపడునటుల నుభయలోక భ్రష్టులయి యనంత కల్పాంతములు గడచినను భగవంతుని యొక్క అనుగ్రహము జెందనేరరు.

అనురక్తి లేని భక్తియు, విరక్తి లేని యోగమును, శాంతవృత్తి లేని జ్ఞానమును నిష్ప్రయోజనములు.

భక్తిమార్గమున నున్నవారికి భగవంతుడు పిల్లలను తల్లి పోషించురీతిగా వారి యొంతెలసంతతము వసించి రక్షించుచుండును. యోగమార్గమున నున్నవారిని వకస్నేహితుడింకొక స్నేహితునియందు స్నేహభావముగలిగి క్షేమలాభములను విచారించునటుల స్నేహభావము కలిగియుండును. జ్ఞానమార్గమున నున్నవారిని తనతో సమానులరుగా నెంచి యాదరించుచుండును.

ఇటువంటి జ్ఞానులకు సంచితమువల్ల గలిగినటువంటి పుణ్యపాపములగతి యేమనిన నాతని దూషించువారు పుణ్యములను, దూషించువారు పాపములను బంచుకొందురు గాన జ్ఞానికి కర్మసంచితము నంటనేరదు.

మరియు సగుణము లవణము వంటిది నిర్గుణము జలము వంటిది. జలమే లవణముగునన్న విషయ మాదరకును దెలసిన

లేకదా? అట్టి ప్రకారమే నిర్గుణ బ్రహ్మము సగుణ బ్రహ్మముగా బరిణమించియున్నది. కర్మ ప్రతిపత్తిగలవారికి మనస్తృప్తి సగుణారాధనమువలన గలిగినట్టుగా నిర్గుణారాధనమువలన గలుగ నేరదు. ఇంద్రియనిగ్రహము గలవారికితప్ప నితరుల కెంతమాత్రమును నిర్గుణధ్యానము పట్టుపడనేరదు. మనస్సు కుదరకమునుపే నిర్గుణధ్యానముచేయ మొదలుపెట్టిన నది బకధ్యానమగును. కాబట్టి క్రమప్రకారముగాకర్మ, భక్తి, జ్ఞానమార్గముల ననుసరించిన యెడలమనుజుడు గడతేరగలడు.

చిన్న మొలక పుట్టగానే వంకరగావున్న యెడల దానిని తిన్నగా జేయుటకు తగినటువంటి కంచెనుగట్టి తిన్నగా జేసి యెరువు మొదలగు వస్తువులనువేసి మొలకకు బలమునుపుట్టించిన యెడల అది పెద్దచెట్టుగా వృద్ధిబొంది అటుపైని సుందరముగా పుష్పించి, కాయలుగాచి పండ్లుపండి చక్కగా శోభిల్లునుకదా? అటువలెనే మనుజుడు బాల్యదశనుంచి మనస్సునువంచి మంచి మార్గమున ప్రవేశపెట్టుటకై తగినటువంటి అభ్యాసములను జేయుచు నిజపదార్థమును గుర్తెరుగుటకు తగినటువంటి సాధనములను సంగ్రహించినయెడల వార్ధికదశనాటికి పండుయనెడు జ్ఞానము వుదయించును. మధ్యరంగమందున ప్రయత్నించిన యెడల యిల్లుమండుచున్నప్పుడు బావిని త్రవ్వప్రయత్నించుట యెంత ప్రయోజనకారియగునో అదికూడా అంతప్రయోజన కారియైనగును. కర్మ, అనుభవించుటకొరకు జీవి స్థూలశ

రీర ధారియగుచున్నది. అటువంటి జీవాత్మయే జ్ఞానదశ నొందిన వెనుక పరమాత్మయై పరిణమించును.

గాన అటువంటి పరమాత్మకు బాలయవ్వన, వార్ధకదశలు లేనందున అటువంటి వానిని సంగ్రహించుటకు జీవి, దేహాధారణాంతరా వేగమే ప్రయత్నించవలెను. అశ్రద్ధగలిగి గాని అవస్థాత్రయములను, దేశకాలమాన స్థితులను పరీక్షించి నడచిన యెడల జీవబంధ విముక్తిని జెందనేరడు.



శ్రీ

# నారాయణ సుభాషితము

ఇష్టదైవము నందుగల శ్రద్ధపాప విముక్తికి సాధకమని పెద్దలువచింతురు. కనుక యిష్టదైవమగు శ్రీరామ పరమాత్మ జీవులను భవసాగరమునుంచి తరింపజేయు వాడగుటచేత తారకనాముడని పేరుగలదు. అటువంటి తారకనాముని చరిత్రము యొక్క అంతరార్థమును తెలసినమీదట శ్రీరామచంద్రులు పరమాత్మయని గ్రహించనగును.

ఆనందమయమగు నపవర్గమను నయోధ్యాపట్టణము నందు పరబ్రహ్మమను దశరథుడుకలడు. అతనికి యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తులను ముగ్గురు భార్యలుగలరు. వారిలో జ్ఞానశక్తియను కౌసల్యాదేవి గర్భమునందాత్మయను శ్రీరామమూర్తి యవతరించి అవ్యక్తమను బాల్యావస్థచే స్వస్వరూప జ్ఞానమునుమరచి, అజ్ఞానమయమగు జీవాత్మయే తాననిభ్రమించి, దేహేంద్రియాది ప్రపంచమునందంతయు నభిమానముంచి శ్రవణమను వసిష్ఠోపదేశముచేత మరలతెలివి తెచ్చుకొని వైరాగ్యమను లక్షణమూర్తిని వెంటదీసుకొని మననమను విశ్వామిత్రునితో బయలుదేరి పంచమహాపాతకములను పర్వతములను గడచి జ్ఞానమను తీక్ష్ణబాణముచేత నావరణమను తాట

కనువర్తించి యిచ్ఛయను మారీచుని సముద్రములో ముంచి, వికారములను సుబాహుప్రముఖులగు కఠినరక్కసుల బెక్కరనుక్కడించి, దురాచారమను శిలను గాలితో దన్ని, సదాచారమను నహల్యనుమన్నించి యేకాంతమను మిథిలాపురము ప్రవేశించి, శాంతమను జనకునిసందర్శించి, అసూయ యను శివధనస్సును విఱచివేసి, ఆనందమను సీతను వివాహము చేసికొని, ప్రతిఘటింపవచ్చిన మదమను పరశురాముని భంగపరిచి, మోక్షమనుసాకేత నగరమునకువచ్చి, తానుజీవుడు కాడని నిశ్చయించి జీవత్వత్యాగమను పట్టాభిషేకమును వహింపబూని క్రియాశక్తియను కైకవలన చపలత్వమను విఘ్నము తటస్థింపగా, బ్రహ్మమను దశరథునిబాసి, మోక్షమను నయోధ్యను వదలి ఆనందమను సీతయు, వైరాగ్యమను లక్ష్మణుడును తోడునడువ బయలుదేరి, చిత్తమను సరయువును దాటి, బుద్ధియను గుహునియాదరణవడసి, నిక్షేపమను మహారణ్యముచొచ్చి, తపస్సను చిత్రకూటముననిలచి అహంకారమను విరాధుని బొలియించి, మనస్సను కాకాసురుని నలయించి, సంకల్పమను కన్నుగ్రుచ్చి, నిర్వికల్పమనుకన్నిచ్చి, వీర్యమను నగస్త్యునాశ్రయించి, ధైర్యమను వస్త్రమును పరిగ్రహించి, కామమను శూర్పణఖను విరూపినిగా జేసి, ఆగామికర్మములను ఖరదూషణాత్రిశిరులను సంహారణజేసి, ఇచ్ఛయను మారీచుడు వంచింపగా, రాజసమనురావణుడు డంబమను సన్యాసి

వేషముతో నానందమను సీత నపహరించు కొనిపోగా, నాత్ముడను రాముడు విజృంభించి, యిచ్ఛయను మారీచుని గీటడంచి, యానందమను సీతనుగానక, యమోఘమైన విచారమునుబొంది, వైరాగ్యమను లక్ష్మణుడు వెంటనడువ విక్షేపమను కికారణ్యములో విచ్చలవిడిదిరుగుచు వివేకమను జటాయువును విమలత్వమను సద్గతినొందించి, చింతయను కబంధుని వధించి, సంతోషమను శబరినిగాంచి, మనోవికాసమను పూజనంగీకరించి, నిధిధ్యాసమను హనుమంతునితో సఖ్యమునరించి, సప్తవిధజన్మములను సప్తతాళములనుభేదించి, భయమనువాలినిగూల్చి, నిశ్చయమను సుగ్రీవుని దేల్చి, నిదిధ్యాసమనుహనుమానుని బుద్ధిగోల్పగా, నతడుమోహమను మహాసముద్రమును లంఘించి, లోభమును లంకిణినిద్రుంచి, దుర్వాసనలను రాక్షసుల నెల్ల మట్టుపెట్టి యానందమను సీతనుగనిపెట్టి, సంకల్పమను అశోకవనమును బాడుజేసి, అజ్ఞానమను జంబుమాలినురుముజేసి సంశయమను అక్షునిశిక్షించి, విపరీతమను నింద్రజిత్తుని తిరస్కరించి, భ్రమయనుపాశమును త్రెంచి, రాజసమును రావణుని ధిక్కరించి, మానమను మహాగ్ని నిప్రజ్వలింపజేసి, దుఃఖమనులంకను దగ్ధముచేసి, మోహమనుమహాసముద్రమును దాటి, మరలివచ్చి యానందమను సీతయొక్క సంగతి దెలియజేయగా, నాత్ముడను రాముడు ప్రయత్నము చేసి మోహమను సముద్రమును భంగిపెట్టి, నిశ్చలతయను

సేతువునుగట్టి, సత్త్వమను విభీషణుని జేపట్టి విపరీతమను నింద్రజిత్తు నెదిరించి, సందేహమను నాగపాశములో జిక్క- సద్విచారమను గరుత్మంతుని విడుగడజెంది, తామసమను కుంభకర్ణుని సంహరించి, భ్రమయను శస్త్రముచే వైరాగ్యమను లక్ష్మణుని మూర్ఛిల్లగా, నిదిధ్యాసమను హనుమానుని ప్రోత్సాహపరిచి, నిష్ఠయను సంజీవిపర్వతమును దెప్పించి, వైరాగ్యమను లక్ష్మణుని మూర్ఛదేర్చి, విపరీతమను యింద్రజిత్తుని పోకార్చి సంచితమను మూలబలము నంతయు సాధనమను మోహనాస్త్రముచే నిర్మూలముచేసి, దుర్వాసనలను నసురులనెల్ల నాశనము జేసి, సద్వాసనలను కపిసైన్యమును సందరించి, గాంభీర్యమను చాపము నెక్కుబెట్టి, రాజసమను రావణుని నెదిరించి, జ్ఞానమను దివ్యబాణమును బ్రయోగించి, అహంకారమను అమృత కలశమును భేదించి యింద్రియములను పదితలలను ఛేదించి, మానాగ్నినుండి పరిశుద్ధమును వహించి వెలువడిన యానందమను సీత నంగీకరించి, బ్రహ్మమను దశరథుని వీక్షించి, మోక్షమను నయోధ్యాపురము జేరి, జీవత్వనివృత్తియను పట్టాభిషేకమును పొంది, బ్రహ్మమను దశరథుడే తానై కేవల బ్రహ్మసాక్షాత్కారమను రాజ్యాధిపత్యమును వహించెను. యిదియే రామాయణము యొక్క పరమగోప్యమైన అంతరార్థము దీనియందాసక్తి బుద్ధిగలిగి అభ్యసించిన యెడల యింద్రియములయొక్క గారడి

విద్య చక్కగా తెలసి, జ్ఞానోదయమై జననమరణములకు హేతుభూతమైన సంసారాంబుధిని దాటుటకు శక్తిగలుగును.

ప్రతినిత్యము దీనిని శ్రద్ధతో పఠించినగాని, విన్నను గాని, ప్రాణులు పామరత్వమునుండి తొలగి భవార్ణవమునుండి తర్లి బ్రహ్మానంద సామ్రాజ్య సంపదను సంపాదించు కొందురు.

ఓం. శ్శాంతిః శ్శాంతిః శ్శాంతిః

సర్వేజనానాం । సుఖినో భవంతు।
సమస్త శ్రీ । సన్మంగళానిభవంతు॥

శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః ॥

సంపూర్ణము.

# ERRATA.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 15 | పీనినే | దీపినే |
| 3 | 1 | తేదు | లేను |
| 5 | 3 | దాబోవు | రాబోవు |
| 16 | 13 | అటివలెనే | అటువలెనే |
| 16 | 17 | తత్వములు | తత్వముల |
| 17 | 21 | సుఖ——ఖమ్ము | సుఖదుఃఖ ము లు |
| 18 | 12 | కఠినముగా | కఠినముగాను |
| 19 | 20 | జీలిక | జీవికి |
| 39 | 6 | బ్రహ్మమును | బ్రహ్మము |
| 40 | 3 | అన్య | అనన్య |
| 52 | 4 | దారణ | ధారణ |
| 52 | 12 | సర్వ. | సర్ప |
| 56 | 10 | అనిగా | అనగా |

